ఉదయం ...
విజయవాడ
మంగళవారం
28-5-1974
THE ANDHRA PATRIKA
Regd. H / VJ. NO. 49
PUBLISHED SIMULTANEOUSLY FROM MADRAS & VIJAYAWADA

# ఆంధ్రపత్రిక

FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO
సంపుటం : 61
సంచిక : 56
పుటలు : 4
వెల : 18 పైసలు



# రైల్వే ఉద్యోగుల సమ్మె విరమణ

న్యూఢిల్లీ, మే 27 : రైల్వే ఉద్యోగుల సమ్మె విరమణ జరిగింది.

ఈ సమ్మె ప్రారంభమయి నేటికి 22 రోజులు అయింది.

రైల్వే ఉద్యోగుల జాతీయ సమన్వయ సంఘం ఈ సమ్మె విరమణకు నిర్ణయం తీసుకున్నారు. సంఘం సభ్యులలో అర్గురు జైలులోను, ముగ్గురు అజ్ఞాతంలోను ఉన్నారు.

సమ్మెను ఏకపక్షంగా విరమించుకోవాలని సమన్వయ సంఘం కన్వీనర్ శ్రీ జార్జి ఫెర్నాండెజ్, జైలులో ఉన్న మిగిలిన సభ్యులు పంపిన వర్తమానాన్ని సమన్వయ సంఘం సమావేశంలో ఆమోదించారు. ఈ సమావేశానికి సంఘం సభ్యులు నల్గురు ప్రత్యేకాహ్వానితులు ముగ్గురు హాజరయినారు.

అఖిలభారత రైల్వే ఉద్యోగుల సమాఖ్య ప్రధాన కార్యదర్శి శ్రీ ప్రియగుప్తా, శ్రీ సమర్ ముఖర్జీ, ప్రభృతులు సమావేశానికి హాజరయినారు. సమ్మె విరమణ నిర్ణయాన్ని శ్రీ ముఖర్జీ అంగీకరించలేదు.

జైలు నుంచి శ్రీ ఫెర్నాండెజ్, శ్రీ జె. పి. చౌబె, శ్రీమతి పార్వతీకృష్ణన్, శ్రీ హెచ్.ఎన్. చౌదరి, శ్రీ శ్రీకృష్ణ పంపిన సమ్మె విరమణ తీర్మానాన్ని సంఘం సభ్యులయిన శ్రీ జి. ఎస్. గోఖలే, శ్రీ ఎం. ఎం. పథక్ ఆమోదించారు.

సమ్మె విరమణ నిర్ణయం తీసుకునేటప్పుడు రాష్ట్రపతి నిన్న మద్రాసులో చేసిన విజ్ఞప్తిని దృష్టిలో పెట్టుకోవడం జరిగిందని సమావేశానికి హాజరయిన కొందరు సభ్యులు చెప్పారు.

—o:o—

# ఈజిప్టుకు ఇరాన్ పెట్టుబడి

కెయిరో, మే 27 : టెహరాన్‌లో నేడు సంతకాలు జరిగిన ఒప్పందం ప్రకారం ఇరాన్ .85 కోట్ల డాలర్లను ఈజిప్టులో పెట్టుబడి పెట నున్నది. ఉభయ దేశాల సంబంధాల మధ్య ఇది పెద్ద పూర్వగాథాని స్తున్నారు. పోర్ట్ సెయిద్‌ను పునర్నిర్మాణానికి ఉభయ దేశాలు కలిసి కృషి చేయగలవని, వర్తక వాణిజ్యాభివృద్ధికి ఇది సహాయపడ గలదని భావిస్తున్నారు.

## ఉష్ణోగ్రత

విజయవాడ, మే 27 : విజయవాడలో నేటి అత్యధిక ఉష్ణోగ్రత 102.4 డిగ్రీలు, (ఫారన్‌హీట్),

## జూన్ 3 వ వారంలో ఇంటర్ పరీక్షలు

స్వకీయ విలేఖరి

కర్నూలు, మే 27: రైల్వే సనివారి సమ్మె కారణంగా వాయిదా పడిన ఇంటర్మీడియట్ పబ్లిక్ పరీక్షలు బహుశా జూన్ మూడవ వారంలో జరగవచ్చునని రాష్ట్ర విద్యామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు నిన్న ఇక్కడ పత్రికల వారితో మాట్లాడుతూ సూచించారు.

టెన్నెసీ, మే 26 : అమెరికాలోని నలుగురు ధనవంతులు కలిసి యిర్వురు హంతకులకు డబ్బు యిచ్చి నీగ్రో నాయకుడు మార్టిన్ లూథర్ కింగ్‌ను చంపించారని యీ కేసులో ప్రధాన నిందితుడైన జేమ్స్ ఎర్ల్‌రే పక్షాన వాదిస్తున్న న్యాయవాది నిన్న న్యాయస్థానంలో అన్నారు.

## భూమితనఖా బ్యాంకు అప్పుగా హెచ్చుమొత్తం

"ఆంధ్రపత్రిక" ప్రతినిధి

హైదరాబాద్, మే 27 : ఆంధ్రప్రదేశ్ సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకివారు అయిదవ ప్రణాళికాకాలంలో రైతులకు వ్యవసాయ కార్యక్రమాలకుగాను అప్పుల కింద రు. 130 కోట్లు ఇవ్వాలని ఒక కోటాగా నిర్ణయించారు. 4 వ ప్రణాళికలో మొత్తం రు. 77 కోట్లుగా వుంది.

1974–75 లో ఇచ్చే మొత్తం రు. 18 కోట్లు. బ్యాంకి ప్రతినిధి ఒకరు ఈ విషయం వెల్లడిస్తూ 1973—74లో రు. 13 కోట్లు ఇచ్చారని, ఆ కిందటి ఏడాదిలో పోలిస్తే ఇది మూడు కోట్లు హెచ్చు అని వివరించారు.

అంతర్జాతీయ అభివృద్ధి సంస్థకు చెందిన రు. 18 కోట్ల పరపతి కార్యక్రమం త్వరలో పూర్తికాగలదని, ఇలాంటి కార్యక్రమాలకు మరికొంత పరపతిదానికి పొందే ప్రయత్నాలు కలవన్నారు.

ఆంధ్రప్రదేశ్ సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకు కొత్త డైరెక్టర్ల బోర్డు ఏర్పడేలోగా, దాని వ్యవహారాలు నిర్వహించడానికి శ్రీ పి. ఆర్. కె. వి. ప్రసాద్ సహకార సంఘాల అడిషనల్ రిజిస్ట్రారును, శ్రీ అబ్దుల్ కరీంఖాన్ సహకార సంఘాల జాయింటు రిజిస్ట్రారును స్పెషల్ ఆఫీసర్లుగా రాష్ట్ర ప్రభుత్వం నియమించింది.

బ్యాంకు డైరెక్టర్ల బోర్డుకు పొడుగించబడిన పదవీకాలం 1974 ఏప్రిల్ 30 తో ముగిసింది.

## శ్రీ గ్రోమికో

మాస్కో, మే 27 : సిరియా నాయకుల అహ్వానంపై సోవియట్ విదేశాంగమంత్రి శ్రీ గ్రోమికో నేడు డెమాస్కస్ వెడుతున్నట్లు టాస్ వార్తాసంస్థ ప్రకటించింది.

సిరియా—ఇజ్రేల్ సేనల విషయమై ఒక ఒప్పందం కుదర్చటానికి అమెరికా విదేశాంగ మంత్రి శ్రీ కీసింజర్ సిరియా అధ్యక్షుడితో చర్చలకు సన్నాహాలు జరుపుతున్న సమయంలో శ్రీ గ్రోమికో అక్కడకు వెడుతున్నారు.



"అర్నీ! నగ్న ప్రదర్శన అంటే యిదా! దగాపడ్డాం (బదర్స్!"

## రాష్ట్ర కల్తీ నిరోధక డైరెక్టరు త్వరలో నియామకం

హైదరాబాద్, మే 27 : కల్తీ నిరోధించటానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీవ్రతర కృషి జరపాలని భావిస్తున్నది.

కల్తీ నిరోధక డైరెక్టరుగా పోలీసు డి. ఐ. జి. హోదాగల అధికారిని నియమించటం జరుగుతుందనీ, ఆహారం, మందుల కల్తీ నిరోధానికి అవసరమైన సిబ్బందిని ఆయనకు సమకూర్చటం జరుగుతుందని రాష్ట్రప్రభుత్వ ప్రతినిధి తెలిపారు.

# బస్ ఛార్జీలు వచ్చే నెలనుంచి కిలోమీటర్‌కు పైస వంతున పెరిగే అవకాశం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, మే 27 : వచ్చే నెల నుంచి బస్ ఛార్జీలను కిలోమీటరుకు ఒక పైస పెంచవలసిన అవసరం కనిపిస్తోందని ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ అధ్యక్షులు శ్రీ సొలసాని నరసింగరావు చెప్పారు. ప్రస్తుతం కిలోమీటరుకు నాలుగు పైసల వంతున వసూలు చేస్తున్నారు. దీనిని ఐదు పైసలు చేయవలసి ఉంటుందన్నారు.

డీలక్స్ సూపర్ డీలక్స్ బస్సుల ప్రయాణం చార్జీలను ఇదివరకే పెంచడమైందన్నారు.

మూనెలు, స్పేర్లు ధర పెరగడం, ఖర్చులు పెరగడం వల్ల బస్ ఛార్జీలను పెంచక తప్పదన్నారు. అయితే తాము అధ్యక్షత పదవిని చేపట్టిన మూడు వారాలనుంచి ప్రయాణికుల సౌకర్యాలపై దృష్టిని లగ్నం చేసున్నామన్నారు.

శ్రీ నరసింగరావు ఇలా చెప్పారు : "ఈ వేసవిలో బస్సుల దగ్గరే మంచినీటిని ప్రయాణికులకు అందించే ఏర్పాటు చేశాము. మరుగు సౌకర్యాలు కల్పించాము. ప్రయాణికులకు విశ్రాంతి స్థానాలు కూడా క్రమంగా ఏర్పాటు చేస్తున్నాము. ప్రయాణికుల సౌకర్యాలు పెంచి, బస్ చార్జి పెంచితే, వారు బాధపడరు. బస్సులు జాతీయం చేసిన మార్గాలలో వాటిని క్రమంగా నడిపిస్తూ, పాతబడిన బస్సుల స్థానే కొత్తవి వేస్తూ, జాతీయకరణ విస్తరణ చేయవలసి ఉంది. అందుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తోడ్పడాలి. రైల్వేవారు క్రిందటేడు, ఈ ఏడు ఇవ్వవలసిన మూడవవంతు వాటా వారు యివ్వలేదు"

"మొత్తం మాకు మూడు వేల బస్సులు ఉన్నాయి. రాజధానిలో 500 వరకు ఉన్నాయి. రాజధానిలో మరో వంద బస్సులు ఉంచినా చెల్లే, ఉన్నవాటిని జాగ్రత్తగా, క్రమబద్ధంగా నడిపితే రద్దీని కొంత తగ్గించవచ్చు. రైలు సనివారి సమ్మెవల్ల మాకు కొత్తగా వస్తున్న బస్సులను దూర ప్రయాణాలకు తరలిస్తున్నాము. ఆ మేరకు క్రిందటి వారము 600 స్పెషల్ బస్సులు నడిచాయి. 200 నుంచి 250 వరకు ఉన్న బస్సులు స్పెషల్ ట్రిప్పులు వేశాయి. మార్కెట్‌లో మూనెల ధరలకుతోడు 27 శాతం నుంచి 52 శాతం వరకు టైర్ల ధర పెరిగింది. దీనిపై ఏటా కోటి రూపాయలు అయ్యేటట్లుంది. పనులు జరుగుతున్న చోట ప్రగతి పెరిగారేదు. దానికి కారణం స్థలంలో తగాదాల వంటివి ఉండటమే. ఆర్థిక వసతి కూడా పెరగాలి ఇప్పుడు వెయ్యి వరకు ఉన్న బస్సుల స్థానే కొత్త బస్సులు పెట్టాలి.

డబుల్ డెక్ బస్సు బాడీ కట్టే ఖర్చు రు 95 వుంచి లక్ష 33 వేల దాకా పెరిగింది. ట్రాఫిక్ పోలీస్, పురపాలకసంఘం రోడ్డు రవాణా సంస్థ ప్రతినిధులు కలిసి కూర్చుని రాజధానిలో ఎక్కడెక్కడ షెల్టర్లు కట్టాలో తేల్చవచ్చు. వచ్చే నెల 3 నుంచి 5 వరకు బెంగుళూరులో జరిగే అంతరాష్ట్రీయ రవాణా సంస్థల ప్రతినిధుల సభకు వెడుతున్నాను. మన ప్రగతి యితర రాష్ట్రాలతో పోల్చి చూసుకోవచ్చు.

"ఇప్పుడు ఒక్కొక్క బస్సుకు సగటున 11 మంది వరకు సిబ్బంది ఉండటం జరుగుతోంది. 8—9కి మించి ఉండరాదు. అలాగే సిబ్బంది పై హెచ్చు ఉన్న ఖర్చులు తగ్గాలి. ప్రజల కష్టసుఖాల గూర్చి వివరాలన్నీ సేకరిస్తున్నాము. తరువాత ఆయా డిపోలకు వెళ్లి, అక్కడికక్కడే నిర్ణయాలు తీసుకోగలము ఆఫీసులకు, బడులకు వెళ్లే సమయాలలో సర్దుబాట్లు గూర్చి ఆలోచిస్తాము. రాజధానిలో ప్రస్తుతం నష్టముతో నడుస్తున్నా క్రమంగా నష్టాన్ని తగ్గించవచ్చు. ప్రజల సహకారంతో ఈ సంస్థను బాగుచేసి వారి సౌకర్యాలు వృద్ధి చేయడానికి శాయశక్తులా కృషి చేస్తాను'.

# భారత్ అణుశక్తి దేశమే: అణ్వస్త్రదేశం కాదని ప్రధాని వివరణ

న్యూయార్క్, మే 27 : అణుశక్తి దేశానికి అణ్వస్త్ర దేశానికీ భేదం వున్నదని, భారతదేశం అణ్వస్త్ర దేశంకాదని, అణుశక్తి దేశమనీ భారత ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధి స్పష్టం చేశారు.

భారత్ అణ్వస్త్ర ప్రయోగం జరిపిన తరువాత మొదటిసారిగా న్యూస్‌వీక్ పత్రిక విలేఖరితో ఈనెల 26 న మాట్లాడుతూ భారత్‌కు అణుపరిశోధనలో, అణుశక్తి పురోగతిలో గల ఆసక్తిని దృష్టిలో పెట్టుకుని మాత్రమే ఈ పరీక్షను గురించి పరిశీలించవలసి వుంటుందని వివరించారు.

భారత దేశానికి అటంబాంబులేదు. భారత్‌కు గల యీ అణు విజ్ఞానాన్ని శాంతియుత కార్యక్రమాలకు తప్ప మరిదేనికీ వినియోగించటం జరగదు. భారత్ పొరుగు దేశాలు యీ పరీక్షకు భయపడవలసిన పని లేదు అని శ్రీమతి గాంధి స్పష్టం చేశారు.

భారత్ అమెరికాల మధ్య సంబంధాలు మెరుగుపడుతున్నట్లు ప్రధాని అన్నారు. అయితే భారత్ అమెరికాల మధ్య సంబంధాలు సహాయం దృష్ట్యానే ఆలోచించటం తగదు అని శ్రీమతి గాంధి అన్నారు. నిజానికి భారత్ గూడా అమెరికాకు సహాయం చేస్తున్నది. భారత శాస్త్రవేత్తలను ఎందరినో అమెరికా రాబట్టుకొంటున్నది అని ఆవిడ అన్నారు.

అరబ్‌దేశాల మూనె ధరను గురించి ఆవిడ ప్రస్తావించి, అరబ్‌దేశాల వాదన సరియైనదని భారత్ గట్టిగా విశ్వసించటంచేత అరబ్ దేశాలను భారత్ బలపరుస్తున్నది అని అన్నారు. ముడి సరుకును ఉత్పత్తి చేసే దేశాలు తమ ముడిసరుకులకు మంచిధరలను పొందే హక్కు వున్నదని భారత ప్రధాని అన్నారు.

రైల్వే సమ్మెను గురించి ఆవిడ ప్రస్తావించి, సమ్మె కార్మికులకు గల న్యాయమైన హక్కు, అయినప్పటికీ దేశపు విస్తృత ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని యీ అంశాన్ని పరిశీలించాలని అన్నారు. భారతదేశంలో అత్యధిక సంఖ్యాక కార్మికులు సమ్మెను వ్యతిరేకిస్తున్నారని అన్నారు.

## తుక్కు ఇనుప ముక్కల దుకాణంలో బాంబు ప్రేలుడు : ఒకరి మృతి

బెంగుళూరు, మే 27 : కంటోన్‌మెంట్ ప్రాంతంలోని తుక్కు ఇనుపముక్కల వ్యాపారం చేసే దుకాణంలో బాంబుగా అనుమానిస్తున్న గుండు ప్రేలి 18 సంవత్సరాల వయస్సు గల పిల్లవాడు మరణించాడు. మరొకరు గాయపడ్డారు.

ఈ దుకాణం ఈ పిల్లవానిదేనట. ఒక గుండులోనుంచి సీసం భాగాలు తీయడానికి ఈ పిల్లవాడు ఈ గుండు మీద సుత్తితో కొట్టడంతో అది ప్రేలింది. ఆతనికి దగ్గరగా మరొకరు దుకాణంలో ఉన్నవానికి గాయాలు తగిలాయి. పిల్లవాడు గాయాలతో ఆసుపత్రిలో మరణించాడు. రెండవవాడు కోలుకుంటున్నాడు.

# కొత్త రాష్ట్రపతి ఎన్నిక పద్ధతిపై సుప్రీంకోర్టు విచారణ ప్రారంభం

న్యూఢిల్లీ, మే 27 : కొత్త రాష్ట్రపతి పదవికి ఎన్నికలు, రద్దు అయిన గుజరాత్ శాసన సభ పునర్నిర్మాణం చేయకుండా జరపవచ్చునా లేదా అన్న అంశంపై భారతప్రభుత్వం కోరిన వివరణపై, సుప్రీంకోర్టు విచారణ నేడు ప్రారంభమైంది.

ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎ. ఎన్. రే అధ్యక్షతను ఏడుగురు జడ్జీలతో ఏర్పడిన సుప్రీంకోర్టు బెంచి రాష్ట్రపతి ఎన్నికకు సంబంధించిన ఈ కింద ఆరు అంశాలమీద తగు అభిప్రాయాన్ని చెప్పవలసివుంది.

1. ఆగస్టు 24 నాటికి ఇప్పటి రాష్ట్రపతి పదవీకాలం ముగుస్తుంది. ఆ తేదీకి పూర్వం వున్న శాసన సభలకు ఎన్నికైన సభ్యులతో కూడిన ఎలెక్టొరల్ కాలేజి రాష్ట్రపతి ఎన్నికకు సరిపోతుందా? 2. ఒక శాసనసభ రద్దు అయినప్పుడు ఎలెక్టొరల్ కాలేజిలో ఖాళీ ఏర్పడినట్లుగా పరిగణించవచ్చునా? 3. ఏ శాసనసభరద్దుతోను సంబంధం లేకుండా ఇప్పటి రాష్ట్రపతి పదవీకాలం పూర్తి అయ్యేలోగా కొత్త రాష్ట్రపతి పదవికి ఎన్నిక జరిపి తీరాలా? 4. ఏ రాష్ట్ర శాసనసభ అయినా రద్దు కావడం రాష్ట్రపతి ఎన్నికను జరపడాన్ని నిరోధిస్తుందా? 5. ఒక రాష్ట్ర శాసనసభ రద్దు అయినప్పుడు, రాష్ట్రపతి పదవిలో వచ్చిన ఖాళీని భర్తీ చేయడానికి ఎలా ఎప్పుడు ఎన్నిక జరపాలి? 6. ఇప్పటి రాష్ట్రపతి పదవీకాలం పూర్తి అయిన తర్వాత, కొత్త రాష్ట్రపతి పదవికి ఎన్నికలు జరగనప్పుడు ఇప్పటి రాష్ట్రపతి పదవిలో కొనసాగవచ్చునా?

ఈ అంశాలపై విచారణ జరిపే సుప్రీం కోర్టు బెంచివారు సంస్థాకాంగ్రెస్, సోషలిస్టు పార్టీ, ఇండియన్ ముస్లింలీగు, భారతీయ జనసంఘ వాదనలను వినడానికి అంగీకరించారు. వ్యక్తులుగా వాదనకు ఆరుగురునుంచి వచ్చిన అర్జీలను నిరాకరించారు. ఇలా అర్జీ దాఖలుచేసిన ఒకరి తరపు లాయరు శ్రీ పీటర్ సామ్యూల్ తన క్లయింటు "రాష్ట్రపతి పదవికి అభ్యర్థి కావచ్చు" కనక వారివాదన వినడానికి అవకాశమివ్వాలన్నారు. ప్రతిఒక్కరూ అభ్యర్థి కావచ్చునని ప్రధాన న్యాయమూర్తి దీనిమీద అన్నారు. ఈన అర్జీని నిరాకరించే ముందు, తనవాదనను వినాలని మరొక అర్జీదారు శ్రీ ఎం. ఎం. బజాజ్ కోరగా ప్రధాన న్యాయమూర్తి అందుకు అంగీకరించదు.

రాజస్థాన్, కేరళ, మణిపూర్, యు. పి. మహారాష్ట్ర ప్రభుత్వాలవాదన పత్రాలు ఆలస్యంగా దాఖలు కావడానికి కోర్టువారు మన్నించారు. తమిళనాడు అదనపు వాదనల పత్రం దాఖలు చేయడానికి వ్యవధిని ఇచ్చారు.

అయితే ఇలా ఆలస్యం కావడం నివారింకరమని, సెలవులు మధ్యలో కోర్టు జరుగుతున్నదని, నిర్ణీతమైన తేదీలలో పత్రాలు దాఖలుకు ఇచ్చిన ఆదేశాలు పాటించడానికి ఉద్దేశించబడినవని ప్రధాన న్యాయమూర్తి ఈ సందర్భంలో వ్యాఖ్యానించారు.

విచారణ ప్రారంభానికి ముందు అసలు ఇలా విచారించడానికి కోర్టుకు గల హక్కును ప్రశ్నిస్తూ శ్రీ ఎల్. కె. అద్వానీ జనసంఘం ఆ సంగతి ముందు నిర్ణయించాలన్నారు.

ప్రధాన న్యాయమూర్తి : ప్రాథమిక అభ్యంతరాలు ఏవీ మేము వినం.

శ్రీ అద్వాని: ఇది చాలా ముఖ్యం. ప్రధాన న్యాయమూర్తి : మీకు అవకాశం వచ్చినప్పుడు ముఖ్యమైన మీ అభ్యంతరాలను గురించి వింటాం.

శ్రీ జగన్మోహనరెడ్డి, అసలు బెంచివారు తగు అభిప్రాయం చెప్పాలా అన్న విషయం కూడా నిర్ణయం కాగలదని, అంశాల మంచి చెడ్డలను గురించి వినగలమన్నారు.

కాని ముందుగా అభ్యంతరాలపై నిర్ణయాలు జరగాలని శ్రీ అద్వాని గట్టిగా కోరగా "మా కాలం విలువైనది. దయచేసి మీరు కూర్చోండి" అని ప్రధాన న్యాయమూర్తి అన్నారు. అందరిలోకి చివరి వాదనదారుగా శ్రీ అద్వాని వున్నారు.

ఇదివరలోనే ప్రకటించినట్లు సెలవులు మధ్యలో జరిగే ఈ విచారణ ఎనిమిది రోజులలో పూర్తికావాలని, అందుకు అందరూ సహకరించాలని ప్రధాన న్యాయమూర్తి కోరారు.

ఆ తర్వాత అటార్నీ జనరల్ శ్రీ నిరేన్‌డే తన వాదన ప్రారంభించారు.

ఈ విచారణ జరిపే బెంచీలో ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎ. ఎన్. రేతో పాటు న్యాయమూర్తులు శ్రీయుతులు పి. జగన్మోహనరెడ్డి, డి. జి. పలేకర్, హెచ్. ఆర్. ఖన్నా, కె. కె. మాథ్యూ, ఎం. హెచ్. బేగ్, వై. వి. చంద్రచూడ్‌లు వున్నారు.



దక్షిణాదిని డోగ్రా రెజిమెంట్ ఆటల పోటీలో 'బి' కంపెనీకి చాంపియన్‌షిప్ ట్రోఫీని శ్రీమతి కె. ఎస్. బజ్వా జనరల్ బజ్వా సతీమణి నుంచి స్వీకరిస్తున్న కమాండర్ హరిచరన్‌సింగ్.

# ఎ.ఐ.టి.యు.సి. సూచనపై రైల్వే నాయకుల విమర్శలు

మద్రాసు, మే 27: సమ్మె చేస్తున్న రైల్వే సిబ్బంది ఇంకా సమ్మెను కొనసాగించాలా లేదా అన్న సమస్యపై వర్గాలవారీగాగాని మండలాలవారీగా గాని నిర్ణయాలుతీసుకోవాలని ఎ.ఐ.టి.యు.సి.చేసినసూచనను శ్రీ కె.ఆనందన్ నంబియార్, దక్షిణ రైల్వే సిబ్బంది సంఘం అధ్యక్షుడు, దక్షిణమండలం రైల్వే సమ్మె సమన్వయ సంఘం సభ్యుడు నేడొక ప్రకటన ద్వారా విమర్శించారు. దేశరక్షణ నిబంధనలను ఉపయోగించి, సమ్మెదారులను చీల్చి సమ్మెను విచ్ఛిన్నంచేయడానికి ప్రభుత్వం వేస్తున్నఎత్తులకు ఎ. ఐ. టి. యు. సి. లొంగిపోయిందని కూడా ఆయన ఈ ప్రకటనలో విమర్శించారు.

### శ్రీ బెనర్జీకి సంజాయిషీ నోటీసు

ఎ. ఐ. టి. యు. సి. నిర్ణయాన్ని విమర్శిస్తూ శ్రీ ఎం. ఎం, బెనర్జీ యం. పి. పత్రికా ప్రకటన చేసినందుకు సి.పి.ఐ.కార్యదర్శి శ్రీ చంద్రరాజేశ్వరరావు నిరసన తెలియజేస్తూ ఢిల్లీ నుంచి ఒక ప్రకటన చేశారు. శ్రీ బెనర్జీ ముందుగా సి. పి. ఐ. కేంద్ర కార్యాలయాన్ని కాని ఎ. ఐ. టి. యు. సి. నాయకులను కాని సంప్రతించి వుండవలసిందన్నారు. బాధ్యతారహితంగా ప్రవర్తించినందుకు శ్రీ బెనర్జీకి సంజాయిషీ నోటీసును జారీ చేస్తున్నట్లు సూచించారు.

దేశం నేడున్న క్లిష్టపరిస్థితులలో రైల్వే కార్మికులకు ఎ. ఐ. టి. యు. సి. సూచించిన మార్గం ఒక్కటే వారి శ్రేయస్సుకు అనువైనదన్నారు.

### పోలీసు దౌర్జన్యాల ఖండన

శ్రీ రమేష్‌సిన్హా (ఎం. ఎల్. సి.) సి.పి.ఐ. నాయకుడు లక్నో నుంచి ఒక ప్రకటనచేస్తూ మొగల్ సరాయ్‌లోని రైల్వే కాలనీలలోను, వారణాసి, ఇజత్‌నగర్, ఝాన్సీలలోని ఠీసిల్ లోకోవర్కుషాపుల జరిగిన దుస్సంఘటనలు గురించి బహిరంగ విచారణ జరపాలని కోరారు ఈ ప్రాంతాలను సందర్శించి వచ్చిన తర్వాత ఆయన ఈ ప్రకటన చేస్తూ ప్రజాస్వామ్యం పేరుతో కార్మికులకు కలిగిస్తున్న గాయాలను విస్మరించడానికి వీలులేకుండా వున్నాయన్నారు. పోలీసులు, సరిహద్దు రక్షణ దళాల వారు యుద్ధకాలంలో వలె వ్యవహరించారని వేల సంఖ్యలో అరెస్టులు చేసి, వందలమందిని జైళ్లకు పంపారని కూడా ఆరోపించారు.

### ఎ ఐ.టి.యు.సి. వైఖరి: రైల్వే ఉద్యోగుల కార్యాచరణ సంఘం విమర్శ

న్యూఢిల్లీ, మే 27: వర్గం వారీగా మండలాల వారీగా ఉమ్మడి నిర్ణయం తీసుకోవలసిందిగా ఎ. ఐ. టి. యు. సి. నిన్న రైల్వే కార్మికులకు యిచ్చిన ఏకపక్షమయిన పిలుపు పట్ల రైల్వే ఉద్యోగుల జాతీయ సమన్వయ సంఘపు కార్యాచరణ సంఘం నేడు విస్మయాన్ని ప్రకటించింది. ఈ పిలుపు విచ్ఛిత్తికి దారి తీయగలదని రైల్వే ఉద్యోగుల కార్మికోద్యమాన్ని అణచివేయడంలో ప్రభుత్వానికి ఇది సాయపడగలదని సంఘం భావించింది.

### మజ్దూర్ యూనియన్

విజయవాడ, మే 27 : అఖిలభారత రైల్వే ఉద్యోగుల సమాఖ్యకు అనుబంధంగా ఉన్న దక్షిణ మధ్యరైల్వే మజ్దూర్ యూనియన్ నేడిచ్చట ఒక ప్రకటన చేస్తూ ఎ. ఐ. టి. యు. సి. చేసిన సూచనను తిరస్కరించింది.

యూనియన్ అధ్యక్షుడు శ్రీ వడివేలు ఒక ప్రకటనలో సమ్మె విషయమై నిర్ణయం చేసే అధికారం ఒక్క జాతీయ సమన్వయ సంఘానికే గలదని అన్నారు. ఎ. ఐ. టి. యు. సి. చేసిన మోసకారి ప్రకటన సూచనలకు ఎవరూ మోసపోవద్దని ఆయన ఉద్యోగులకు విజ్ఞప్తి చేశారు.

### ఎ. కె. గోపాలన్ విజ్ఞప్తి

త్రిచూర్, మే 27 : అసంతృప్తి, అవమానాలకు తావులేకుండా రైల్వే సమ్మె విరమణకు అవసరమైన సామరస్య పూర్వకమైన వాతావరణాన్ని కలిగించాలని లోక్‌సభలో మార్క్సిస్టు పక్షం నాయకుడు శ్రీ ఎ. కె. గోపాలన్ నేడు ప్రధానమంత్రికి విజ్ఞప్తిచేశారు.

రైల్వే సిబ్బంది సమ్మెను అణచివేయడానికి ప్రధానమంత్రి నియంతృత్వ పద్ధతులు చేపట్టారని ఆయన శ్రీమతి గాంధికి వ్రాసిన బహిరంగ లేఖలో విమర్శించారు.

### ఎన్. జి. గోరే సూచన

కొల్హాపూర్, మే 27 : దేశంలోని యావత్తు శ్రామికవర్గం రైల్వే సిబ్బంది సమ్మెకు మద్దతుగా సార్వత్రిక సమ్మె జరపాలని సోషలిస్టు నాయకుడు శ్రీ ఎన్. జి. గోరే సూచించారు.

సమ్మె చేస్తున్న రైల్వే ఉద్యోగులపై ప్రభుత్వం జరుపుతున్న దమనకాండ శ్రామిక వర్గానికి సవాలుగా ఉన్నదని సమిష్టి చర్య ద్వారా ఈ సవాలును ఎదుర్కోవాలని ఆయన అన్నారు.

### రైల్వే సమ్మె విరమణకు శ్రీ రంగా విజ్ఞప్తి

విజయవాడ(?), మే 27 : రాష్ట్రపతి సలహాను పాటించి బేషరతుగా సమ్మెను విరమిస్తే రైల్వే ట్రేడ్ యూనియన్ నాయకులు ప్రజల సానుభూతిని తిరిగి పొందగలరని ఆచార్య ఎన్. జి. రంగా నేడొక ప్రకటన చేశారు. పారిశ్రామిక కార్మికులకు ఎప్పటికప్పుడు సౌకర్యాలు కలిగిస్తూ దేశ ఆర్థిక వ్యవస్థకు ఇంకా నష్టం కలిగించరాదని కేంద్ర ప్రభుత్వము తీసుకున్న గట్టి నిర్ణయానికి ప్రజలనుంచి హెచ్చు మద్దతు కలదని గుర్తించవలసి ఉంటుందని కూడా శ్రీ రంగా ఈ ప్రకటనలో వివరించారు.

# పైలట్ రైలుతో ఎక్స్‌ప్రెస్ ఢీ

త్రిచూరు, మే 27 : కొచ్చిన్ వెడుతున్న మంగళూరు ఎక్స్‌ప్రెస్ నేట ఉదయం త్రిచూర్ అవుటర్‌సిగ్నల్ సమీపంలో తన పైలట్ రైలునే ఢీకొన్న ఫలితంగా కనీసం28 మంది ప్రయాణీకులు గాయపడ్డారు.

గాయపడినవారిలో యిద్దరు పోలీసులున్నారు. గాయపడినవారిలో యిద్దరికి ఎముకలు విరిగాయి.వెంటనే వారిని ఆస్పత్రిలో చేర్చారు. మిగిలినవారికి ప్రాథమికచికిత్స జరిపి పంపివేశారు.

అవుటర్ సిగ్నల్ సమీపంలో ముందువెడుతున్న పైలట్‌గూడ్సు రైలు ఒక మలుపు తిరుగుతుండగా మంగళూరు ఎక్స్‌ప్రెస్ డీజిల్ ఇంజన్ వెళ్ళి దానిని వెనుకనుండి ఢీకొన్నది.

—:o:—

### కేల్కార్ కుమారుని మృతి

న్యూఢిల్లీ, మే 27 : డాక్టర్ బి. డి. కేల్కార్ కేంద్ర పరిశ్రమలశాఖ మాజీ డైరెక్టర్ జనరల్ గుండెపోటువల్ల మరణించారు. వయస్సు 62. ఈయన మహాత్మాగాంధి సహచరుడు కాకాసాహెబ్ కేల్కార్ కుమారుడు. వీరికి ఇద్దరు కుమారులు వున్నారు,

### బస్సును వెంటాడి ధాన్యం స్వాధీనం

వెల్లూరు, మే 27 : ఉత్తరార్కాట్ జిల్లాకలెక్టర్ శ్రీ కిరుబకరీన్, జిల్లా సరఫరా అధికారి శ్రీ శివరాజన్ నిన్న ఒకబస్సును వెంటాడి దానినుంచి 8 బస్తాల ధాన్యాన్ని స్వాధీనం చేసుకున్నారు.

కలెక్టరు వెల్లూరునుంచి తిరువణ్ణామలై వెడుతుండగా, ఈ బస్సు కనిపించింది. బస్సును ఆపవలసినదిగా కలెక్టర్ చేసినసంజ్ఞను బస్సు డ్రయివరు త్రోసివేసి, వేగంగా నడపడం ప్రారంభించాడు. అంత అధికారులు మూడు కిలోమీటర్లు వెంబడించి, బస్సును ఆపి, ధాన్యాన్ని స్వాధీనం చేసుకున్నారు.

### జి సంజీవరెడ్డి

హైదరాబాద్, మే 27 : రాష్ట్ర ఐ ఎన్ టి యు సి అధ్యక్షుడుగా మాజీ మంత్రి శ్రీ జి. సంజీవరెడ్డి తిరిగి ఎన్నికయ్యారు.

ఈ ఎన్నికల నిర్వహణకు ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌వారు కోశాధికారి శ్రీ సి. ఎం. స్టీఫెన్స్‌ను పంపారు.

# కృష్ణా - పెన్నార్ ప్రాజెక్టు సాధనకై రాయలసీమ కార్యాచరణసంఘం ఏర్పాటు

స్వకీయ విలేఖరి

తిరుపతి, మే 27 : రాయలసీమ ప్రతినిధులు మొన్న సాయంకాలం ఇక్కడ విశ్వవిద్యాలయ హాలులో సమావేశమై కృష్ణా నదీ జలాల వినియోగం ఈ జలాలలో రాయలసీమ వాటా గురించి చర్చించారు. రాయలసీమ అభివృద్ధి బోర్డు అధ్యక్షుడు శ్రీ కె. వి. వరసన్న అధ్యక్షత వహించారు. ఇదివరలో నాయకులు రాయలసీమకుఇచ్చిన రాజకీయవాగ్దానాలు గురించి, సాంకేతిక అవకాశాలను గురించి రాయలసీమకు ఎంతమాత్రం నీరులభించని పరిస్థితికి దోవతీసిన రాజా పరిణామాలను గురించి ఈ సమావేశంలో చర్చించారు. ఈ సమస్యను గురించికేంద్రానికిరాష్ట్రప్రభుత్వం తిరిగినవప్రతినివేదించాలనివలువురువక్తలుసూచించారు

రాయలసీమప్రజలకు ప్రాణంతో సమానమైన ఈ విషయంపై అవసరమైతే పోరాటంజరపాలన్నారు.రాయలసీమలోసాగు అభివృద్ధికి ప్రత్యామ్నాయ సౌకర్యం లేదన్నారు. తమ లక్ష్య సాధనకు ఈ సమావేశం ఒక కేంద్ర కార్యాచరణ సంఘాన్ని ఏర్పాటు చేసింది. కృష్ణా జలాల ద్వారా రాయలసీమ అభివృద్ధికి ఉద్దేశించిన ప్రాజెక్టు కాలువల సన్నిటినీ త్రవ్వవలసిందని, ఖోస్లా కమిటీ సిఫార్సులను, నాగార్జున సాగర్ నిర్మాణం సమయంలో ఇచ్చిన హామీల దృష్ట్యాను, ఆ కాలువల ద్వారా నీటిని మళ్లించి, కృష్ణా—పెన్నార్ ప్రాజెక్టును చేపట్టాలని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను కోరుతూ తీర్మానించారు.

రాష్ట్ర శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు, రాజకీయ పార్టీల ప్రతినిధులు సమితుల అధ్యక్షులు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

సమావేశాన్ని శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య ప్రారంభిస్తూ, ఈ సమస్య పుట్టుపూర్వోత్తరాలను వివరించి ఈ న్యాయమైన కోర్కెను నిరాకరిస్తే, రాయలసీమకు శాశ్వత కరువు తప్పదనీ. పారిశ్రామికంగా కూడా అభివృద్ధి అసాధ్యమనీ అన్నారు. ఈ విషయంలో మనం విఫలులమైతే భావితరాలవారు మనను క్షమించరన్నారు.

శ్రీ అయ్యపు రెడ్డి మాట్లాడుతూ శ్రీశైలంను ఇరిగేషన్ ప్రాజక్టుగా చేయాలనీ, అందువల్ల రాయలసీమలో అయిదు లక్షల ఎకరాలు సాగు కాగలవని అన్నారు.

పార్లమెంటు సభ్యుడు శ్రీ ఈశ్వరరెడ్డి మాట్లాడుతూ రాయలసీమ వాదుల కోర్కెకు రాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ కిసాన్‌సభ మద్దతు ఇస్తున్నాయని చెప్పారు. లేకపోతే రాయలసీమ శాశ్వత కరువుప్రాంతంగానే ఉండిపోవటం, ప్రాంతీయ అసమానత్వాలు మరింత పెరగడం జరుగగలదన్నారు.

సదాశివన్ మాట్లాడుతూ మొదట కృష్ణా బచావత్ క్రింద 50 వేల ఎకరాలు మాత్రమే రెండవపంటకు వీలున్నదనీ, కాని ఇప్పుడు ఐదు లక్షల ఎకరాల భూమిలో వేస్తున్నారనీ అన్నారు. కృష్ణానదిపై ఇతర పథకాలను అమలు చేయనందున ఇది సాధ్యమైందన్నారు. గుంటూరులో లాభకరమైన ప్రత్తి వంటి వాణిజ్య పంటలు వేస్తున్నారంటూ ఇప్పుడు వీరు ఈ పద్ధతిని విడనాడరాదనీ, ఇందువల్ల అదనపునీటిని రాయలసీమకు మరలించే వీలుఏర్పడుతుందనీ అన్నారు. కృష్ణా పెన్నార్ వల్ల రాయలసీమలో 8 లక్షల ఎకరాలభూమి సాగు కాగలదన్నారు. రాయలసీమ ప్రజల త్యాగం లేకపోతే నాగార్జునసాగర్ వచ్చేదికాదనీ అదేవిధంగా ఆంధ్రప్రాంతంవారు రాయలసీమకు నీటిని సరఫరా చేయాలనీ అన్నారు.

మాజీమంత్రి శ్రీ రాజగోపాలరెడ్డి మాట్లాడుతూ, క్షామనివారణ పనులు మొదలైనవాటిపై కోట్లాదిరూపాయలు ఖర్చు చేయడానికి మారుగా, ప్రధానప్రాజెక్టు పూర్తి కావడానికి ముందు కాలువల త్రవ్వకం, రిజర్వాయర్ల నిర్మాణం వంటివి చేపట్టాలని కోరారు. రాజ్యసభ సభ్యుడు శ్రీ ఎం. నరసింహారెడ్డి మాట్లాడుతూ ఈ పని జరగకపోతే రాయలసీమ ఎడారి ప్రాంతం కాగలదన్నారు. శ్రీ పి. వి. చౌదరి మాట్లాడుతూ మెకంజీ పథకాన్ని అమలు చేయాలని కోరారు. శాసనమండలి సభ్యుడు శ్రీ సూర్యప్రకాశరెడ్డి మాట్లాడుతూ జనసంఘం పూర్తి మద్దతును ప్రకటించారు. ఉద్యోగాన్ని(?) ప్రారంభించాలని ఆయన సూచించారు. శాసనసభ్యుడు శ్రీ హబిబుల్లా ప్రభృతులుకూడా మాట్లాడారు.

శ్రీ నరసప్ప మాట్లాడుతూ అభివృద్ధికి నీటిపారుదలం, పరిశ్రమలు రెండూ కళ్లవంటివనీ, ఇవి అభివృద్ధి చెందాలనీ అన్నారు.

బెంగుళూరు, మే 27 : ప్రభుత్వ రంగానికి చెందిన ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్ 1973–74 లో మొత్తం రు. 550 లక్షల లాభం పొందింది. గత ఏడాది వచ్చినలాభం రు. 404 లక్షలు మాత్రమే.

# కాకినాడలో నావల తయారీ కర్మాగారం

ఆంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాదు, మే 27 : 50 అడుగులు, 100 అడుగుల ఉక్కు నావలను తయారు చేయటానికి కాకినాడలో ఒక కర్మాగారాన్ని ప్రయివేటు రంగంలో 27 లక్షల రూపాయల ఖర్చుతో ఏర్పాటు చేస్తున్నారు.

ఈ కర్మాగారంలో 400 మందికి ఉపాధి లభిస్తుంది. ఈ కర్మాగారంలో ఉత్పత్తి యీ సంవత్సరం చివర ప్రారంభం కాగలదని తెలుస్తున్నది.

ఈస్ట్ కోస్ట్ బోట్‌బిల్డర్ ఇంజనీర్స్ అనే పేరుగల యీ సంస్థ అధ్యక్షుడు కెప్టెన్ పార్థసారథి తమ కర్మాగారానికి రాష్ట్ర ఆర్థిక అభివృద్ధి సంస్థ 14 లక్షల రూపాయలు ఋణంగా యిచ్చినట్లు తెలిపారు.

ఈ సంస్థ ఉత్పత్తి ప్రారంభించిన తరువాత సంవత్సరానికి ఒకకోటి రూపాయలువిలువగల నావలను ఉత్పత్తి చేయగలదని ఆయన తెలిపారు.

—o:o—

### ప్రధాని పదవి : శ్రీమతిగాంధి వ్యాఖ్య

న్యూఢిల్లీ, మే 27: ప్రధాని పదవి అత్యంత బరువు బాధ్యతలతో కూడినదికనుక పదవీ విరమణ చేయదల్చుకున్నారా అని నిన్న శ్రీమతి గాంధితో గోష్ఠి జరిపిన అమెరికన్ పత్రిక న్యూస్‌వీక్ విలేఖరి అడిగారు.

"నేను పదవీ విరమణ చేయటం,చేయకపోవటం అనేది భారత ప్రజలపై ఆధారపడవుంది" అని ప్రధాని అన్నారు.

## గంటల పంచాంగం

శ్రీ ఆనందనామ సం. జ్యేష్ఠ శు. సప్తమి:
1974 వ సం. మే 28 మంగళవారం
మంగ: శుద్ధ సప్తమి : ఉ. 7.35, మఖ: సా. 6.34, వర్జ్యం : ఉ. 7.15 మొదల 8.45 వరకు, రా. 2.14 మొదలు 3.46 వరకు.

1974 వ సం. మే 29 బుధవారం
బుధ: శు. అష్టమి : ఉ. 5.37, నవమి: తె. 4.01, పుబ్బ: సా. 5.34, వర్జ్యం: రా. 12.35 మొదలు 2.09 వరకు.

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 — 1972)

# ఆంధ్రపత్రిక

ఒకులేయవి యొనరించిన
వరవర య(ప్రియము తన మనంబునకగు దా
వారులకు నవి సేయకునికి
విరాయణము వరమ ధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

శ్రీ ఆనందనామ సం. జ్యేష్ఠ శు. సప్తమి:
మంగళవారం

## రాష్ట్రపతి విజ్ఞప్తి

—o:o—

అధికారుల ప్రకటనలని పూర్తిగా నమ్మనివారికి కూడా రైల్వే సమ్మె క్రమంగా సడలిపోతోందనిపిస్తోంది. కొన్ని నగరాలలోతప్ప తక్కినచోట్ల రైలుబళ్ళ కదలికలు బాగానే ఉన్నాయని ఎప్పటికప్పుడు వెలువడుతున్న సమాచారం సూచిస్తోంది. ఇటువంటి పరిస్థితులలో సమ్మెని విరమించుకొనటానికి తగిన అవకాశం కోసం కార్మిక నాయకులు కూడా ఎదురుచూస్తూ ఉండి ఉండవచ్చు. రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి విజ్ఞప్తి వారికి ఈ అవకాశాన్ని ఇస్తుంది. కాంగ్రెస్ కార్యవర్గం దేశంలోని వేతనాలు, ఆదాయాలని ఒక మార్గంలోకి తీసుకురావలసిన అవసరాన్ని గురించి ఒక తీర్మానం చేసింది. ఈ తీర్మానాన్ని పురస్కరించుకుని సమ్మెదారులు తమ సమ్మెని విరమించుకోవాలని శ్రీ గిరి కోరుతున్నారు. తమకి ఒక 'మెమొరాండం' సమర్పించుకొనడానికి వెళ్ళిన కొందరు కార్మిక నాయకులకి కూడా రాష్ట్రపతి ఇదే సూచన చేశారు. శ్రీ గిరి ఒకప్పుడు సుప్రసిద్ధ కార్మిక నాయకులు కూడా. కనుక వారి సూచనలని అందరు శ్రద్ధతో పరిశీలించటం అవసరం. బోనసు, వేతనాలు, ఆదాయాలు—వీటన్నిటినీ నిపుణులు సక్రమంగా పరిశీలించి దేశంలోని అన్ని వర్గాల వారికి న్యాయం చేకూర్చే పథకాలని తయారు చేసినట్లయితే ఇప్పుడు ఎందరినో పీడిస్తున్న సమస్యలు కొంతవరకు తగ్గవచ్చు. అయితే, ఇటువంటి పథకాలమీద అతిగా ఆధారపడి ప్రయోజనం లేదు. భారతదేశం వంటి దేశంలో ఆదాయాలమధ్య వ్యత్యాసాలని తగ్గించడానికి జరిగే ప్రయత్నాలు ఫలిస్తాయని ఎదురుచూడలేము. అత్యధికంగా కన్పించని జీతాలు తీసుకునేవారు కొందరు తమకి అందుబాటులో ఉన్న కొన్ని సౌకర్యాలని వాడుకొనటం వలన మామూలు ప్రజలకి లభ్యంకాని "వైభోగాల"ని అనుభవించగలరు. ద్రవ్యోల్బణం పెరిగిపోతున్నకొద్దీ వేతనాలు ఎంత అధికం అయినప్పటికి అసంతృప్తి, ఇంచుమించు అన్ని వర్గాలలోనూ పెరుగుతూనే ఉంటుంది. అధికారంలో ఉన్నవారు ఒకవర్గం వారికి కొన్ని సదుపాయాలు కల్పించి తక్కినవారికి వాటిని అందకుండా చెయ్యటంవలన అసంతృప్తిని మరింత పెంచుతూ ఉంటారు. వేతనాలు, ఆదాయాలని దారిలోకి తీసుకురావాలనుకునేవారు వీటినన్నిటిని దృష్టిలో ఉంచుకొనటం మంచిది. రైల్వే సమ్మె త్వరలో ఆగిపోతుందని ఆశించాలి.

## తమిళుల ఆధిక్యత సాధనకై అన్నా సమాధి ఎదుట ప్రతిజ్ఞ

మద్రాసు, మే 27 : తమిళుల హక్కుల రక్షణ సంఘం సభ్యులు నిన్న నగరంలో అన్నాదురై సమాధివద్ద జరిపిన సమావేశంలో తమిళనాడులో మళయాళీలవంటి ఇతరులు ఏ సంస్థకు అధిపత్యం వహించకుండా, ఏ పార్టీకి గాని, ప్రభుత్వానికి గాని ఆధిపత్యం వహించకుండా చేయగలమని ప్రతిజ్ఞ చేశారు.

ఏ రంగంలోనైనా సరే తమిళులపై ఇతరులు ఆధిక్యత వహించకుండా చేయటానికి కూడ వారు ప్రతిజ్ఞ చేశారు.

అంతకుముందు వారు ఊరేగింపుగా ఇ.వి. రామస్వామి నాయకర్ సమాధి అన్నాదురై సమాధివద్దకు వచ్చారు. దారిలో వారు సంస్థా కాంగ్రెసు నాయకుడు కామరాజ్ విగ్రహానికి, అన్నాదురై విగ్రహానికి పూలమాలలు వేశారు.

"మళయాళీలను తరిమి వెయ్యాలి" తమిళులకే ఉద్యోగాలివ్వాలి అంటూ ఊరేగింపుదారులు నినాదాలు చేశారు. ఊరేగింపు మవుంట్‌రోడులో వెడుతుండగా మళయాళ సినిమాలు ఆడుతున్న రెండు హాలులపై వీరు రాళ్ళు వేశారు. ఒక సినిమా సంస్థను ధ్వంసం చేశారు. కొన్ని దుకాణాలు, వాణిజ్య సంస్థలపైన రాళ్ళు రువ్వారు.

ఊరేగింపు సాగిన ఆరు కిలోమీటర్ల పొడవునా ఊరేగింపువెంట భారీసంఖ్యలో పోలీసులు గస్తు దళం వెళ్ళింది. ఊరేగింపు వెళ్ళిన మార్గంలో దుకాణదారులు భయంతో దుకాణాలను మూసివేశారు.

### సుందర్‌లాల్ నహతా ఖండన

దక్షిణ భారత ఫిలిం వాణిజ్యమండలి అధ్యక్షుడు శ్రీ సుందర్‌లాల్‌నహతా నిన్న ఒక ప్రకటన చేస్తూ, నగరంలో మళయాళ సినిమాలు ఆడుతున్న హాలులపై జరిగిన దాడులను ఖండించారు.

నగరంలో సినిమా పరిశ్రమ యీనాడు యింత ఉన్నత స్థితిలో వుండి 50 వేల మందికి పైగా ఉద్యోగాలను కల్పిస్తున్నదంటే దానికి కారణం తమిళులు, తెలుగువారు, మళయాళీలు, కన్నడిగులు మొదలైనవారేనని ఆయన అన్నారు. నిన్న జరిగిన ప్రదర్శనవలన తమిళనాడు ఆర్థిక పరిస్థితి దెబ్బతినే ప్రమాదం గలదని ఆయన హెచ్చరించారు.

### బెంగుళూరులో అరెస్టులు

బెంగుళూరు, మే 27 : తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధి నిన్న శివాజీనగర్ స్టేడియంలో ప్రసంగించవలసిన సభా ప్రాంతంలో అన్నా డి. ఎం. కె. సభ్యులు ప్రదర్శనలు జరిపినప్పుడు పోలీసులు 200 మందిని అరెస్టు చేశారు.

శ్రీ కరుణానిధి నిన్న రాత్రి పొద్దుపోయిన తరువాత గాని బెంగుళూరు చేరలేకపోయినందున ఆయన ప్రసంగించవలసిన సభ జరుగలేదు. నేడు ఆయన అదే ప్రదేశంలో సభలో ప్రసంగిస్తారు.

### కేరళ తమిళనాడు బస్సులు ఢీ

తిరువేంద్రం, మే 27 : కేరళ గవర్నమెంటు బస్సు, తమిళనాడు గవర్నమెంటు బస్సు తిరువేంద్రం—నగర్‌కోయిల్ రోడ్డుమీద ఢీకొనడంతో ఒకరు అక్కడికక్కడే మరణించారు 15 మంది గాయపడ్డారు.

### లారీ డ్రయివర్ల సహకార సంఘాల స్థితి

ఆంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాదు, మే 27 : ఆంధ్రప్రదేశ్ లారీడ్రయివర్ల సహకార సంఘాల అసోసియేషన్ అధ్యక్షులు శ్రీ కె. రాఘవరావు (విజయవాడ) కార్యదర్శి శ్రీ షేక్ హుస్సేన్ (గుంటూరు) నాయకత్వాన ఒక ప్రతినిధివర్గం ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారిని కలుసుకొని ఒక నివేదికను సమర్పించారు.

ఆంధ్రప్రదేశ్‌లోని 25 లారీ డ్రయివర్ల సహకార సొసైటీలవారికి లారీల కొనుగోలు రాష్ట్రప్రభుత్వం అప్పుగా రు. 17 లక్షలు ఇచ్చిందని, కాని బ్యాంకులు అప్పులు విడుదల చేయడంలేదని, కంపెనీలనుంచి రావలసిన చాసీసులు సప్లయికావడంలేదని వివరిస్తూ శ్రీ హుస్సేన్ ఒక ప్రకటన చేశారు.

—o:o—

### తమిళనాడు జవుళి మిల్లుల జాతీయం సమస్య

మద్రాసు, మే 27: తమిళనాడులో సరిగా నడవక, రాష్ట్ర జవుళి కార్పొరేషను కింద వున్న 12 జవుళి మిల్లులను జాతీయం చేయాలని రాష్ట్రప్రభుత్వం ఉద్దేశిస్తున్నట్లు పరిశ్రమల మంత్రి శ్రీ మాధవను చెప్పారు. ఈ మిల్లుల నిర్వహణలోను, పెట్టుబడిలోను ఆమోదించిన పద్ధతిలో కేంద్రం కూడా పాల్గొనదలిస్తే తప్ప అభ్యంతరం లేదని కూడా ఆయన అన్నారు. నిన్ననే ఢిల్లీలో సమాలోచనలు జరిపి శ్రీ మాధవను ఇక్కడికి తిరిగి వచ్చారు.

## మా ఊరి సమస్య

### చెరువు కొరత

(10రూ. బహుమతిపొందినలేఖ)

గ్రామంలో నీటి కరువు అధికంగా ఉంది. కాని పంచాయతీవారు చెరువు త్రవ్వకానికి గ్రాంటు చెయ్యడంలేదు.

తాడి వెంకటరంగయ్యప్పారావు. తాడి లక్ష్మయ్యగారి కుమారుడు, పెరికీడు వంతెన, గన్నవరం తాలూకా, కృ. జి.

## రష్యాలో ధరల పరిస్థితి

మాస్కో, మే 27: సోవియట్ పౌరుడు ఈ నాడు, కిలో రొట్టెకు 13 కొపెక్కులు మెట్రోలోను, బస్సులలోను ఎంత దూరానికైనా అయిదు కొపెక్కులు, వసతి క్రింద కుటుంబ బడ్జెట్‌లో 34 శాతము చెల్లిస్తున్నాడు.

సోవియట్ తొమ్మిదవ పంచవర్ష ప్రణాళిక 191—5 మధ్యంతర మదింపుల సోవియట్ కార్మికుల, ఉద్యోగుల వేతనాలలో క్రమాభివృద్ధి వున్నట్లు, వాడకం వస్తువులు శాశ్వత వస్తువుల ధరలు గత మూడేళ్లలో తగ్గినట్లు సాప్తాహిక ఆర్థిక గెజెట్ తెలుపుతున్నది.

ప్రణాళిక చివరి మూడేళ్లలో సోవియట్ ప్రజల ప్రతి శీర్ష ఆదాయం మొత్తం మీద 13.5 శాతం పెరిగింది. ఈ నాడు నెలసరి ఆదాయం 140 రూబుళ్లు దాదాపు రు., 1500 లు గాను వ్యవసాయ కూలీల ఆదాయం 90 రూబుళ్లు దాదాపు.950 గాను వుంది.

సోవియట్‌లో ధరల స్థాయి స్థిరంగా వున్నట్లు ఆ నివేదిక తెలుపుతోంది. వాస్తవానికి అనేకం రొట్టె, మాంసము, పంచదార, పాలు లాంటి అత్యవసరవాడకం వస్తువుల ధరలు గత పదేళ్లలో స్థిరంగా వున్నాయి.

—o:o—

## శాంతి మండలంగా హిందూమహాసముద్రం: బంగ్లా, రష్యాల ప్రకటన

మాస్కో, మే 27 : హిందూమహాసముద్రాన్ని శాంతిమండలంగామార్చాలని సోవియట్ యూనియన్, బంగ్లాదేశ్‌లు నేడు కోరినవి.

బంగ్లాదేశ్ విదేశాంగ మంత్రి డాక్టర్ కమాల్ హుస్సేన్ రష్యాలో జరిపిన అయిదు రోజుల పర్యటనానంతరం విడుదలైన ఒక సంయుక్త ప్రకటనలో హిందూమహాసముద్రాన్ని శాంతిమండలంగా మార్చే సమస్యకు అనుకూలమైన పరిష్కారం కనుగొనే యత్నంలో సమానత్వం ప్రాతిపదికపై అన్ని దేశాలతో కలసి కృషి చేయడానికి రష్యా, బంగ్లాదేశ్‌లు తమ సంసిద్ధతను వ్యక్తం చేశాయి.

ఐక్యరాజ్యసమితిలో బంగ్లాదేశ్ సభ్యత్వాన్ని సోవియట్ రష్యా సమర్థించిందని కూడా ఈ ప్రకటన తెలిపింది. బంగ్లాదేశ్ సందర్శించవలసిందన్న ఆహ్వానాన్ని రష్యా విదేశాంగమంత్రి గ్రోమికో అంగీకరించారు.

## భారత్‌పై అదుపు: న్యూయార్క్ టైమ్స్ సూచన

న్యూయార్క్, మే 27: భారత్, తదితర దేశాలు ఇకపై అణ్వస్త్రాలు ప్రేల్చకుండా అగ్ర రాజ్యాలు నిరుత్సాహపరచాలని 'న్యూయార్క్ టైమ్స్' పత్రిక సూచించింది.

ఈ నెల 18 వ తేదీన భారత్ అణుశక్తి పరీక్ష జరిపిన తర్వాత ఈ పత్రిక ఈ విషయమై సంపాదకీయం వ్రాయటం ఇది రెండవ సారి.

భారత్‌కు అణు రియాక్టర్లను, ప్రేలుడు వస్తువులను, సాంకేతిక పరిజ్ఞానాన్ని, అందజేసిన దేశాలు అణ్వస్త్రం వ్యాప్తి రంగంలో ఏర్పడిన ఈ కొత్త ప్రమాదాన్ని నివారించడానికి నమిష్టి బాధ్యత కలిగి వున్నవని ఈ పత్రిక వ్రాసింది.

తన అణుశక్తి ప్రయోగాలు శాంతి ప్రయోజనాల కంటూ భారత్ చేసే ప్రకటనలను నమ్మరాదని, రాజకీయ, దౌత్య సంబంధాలను ప్రక్కకు నెట్టాలని కెనడా ఇప్పుడు తీసుకున్న చర్యలనే ఇతర దేశాలు కూడా తీసుకోవాలని ఈ పత్రిక సలహా యిచ్చింది.

బడుగు దేశాలు కూడా అణ్వస్త్రాలు తయారు చేయడం ప్రారంభిస్తే పశ్చిమ జర్మనీ, జపాన్ వంటి సంపన్న దేశాలను ఈ విషయంలో ఆపడం కష్టమని పేర్కొన్నది.

—o:o—

### భారత్-ఫిన్‌లాండ్‌ల వాణిజ్యాభివృద్ధి

న్యూఢిల్లీ, మే 27 : భారత ఫిన్‌లాండ్‌లు వాణిజ్యాభివృద్ధికి కొన్ని ఏర్పాట్లు చేసుకొనడానికి అంగీకరించారు. హెల్‌సింకీలో భారత్ వాణిజ్యమండలి కొనసాగించిన చర్చల ఫలితంగా ఈ ఏకాభిప్రాయం కుదిరింది.

## సమాజ పునర్నిర్మాణానికి నెహ్రూ కృషి: హక్సర్ వివరణ

లండన్, మే 27: జవహర్‌లాల్ నెహ్రూ సిద్ధాంతాలు బాగుపడేనాటికి ప్రపంచానికి యీనాటికి అవసరమని శ్రీ పి. ఎన్. హక్సర్ లండన్ విశ్వవిద్యాలయంలో నెహ్రూ స్మారకోపన్యాసం చేస్తూ తెలియజేశారు. నెహ్రూ స్మారకమండలి యీ ఉపన్యాసాలను ఏర్పాటు చేసింది.

భారతదేశంలో లౌకికవాదము, ప్రజాస్వామ్యము ప్రణాళిక శాస్త్రీయ సాంస్కృతిక రంగాల అభివృద్ధికి శ్రీ నెహ్రూ చేసిన సేవను గురించి శ్రీ హక్సర్ ప్రస్తావించారు. నిస్తబ్దమైన భారతీయ సమాజాన్ని ఆధునిక 20వ శతాబ్దపు సవాళ్లను ఎదుర్కొనే విధంగా ఉట్టి చైతన్యవంతం చేయటానికి ఆయన తన స్వకీయ పంథాలో కృషి చేశాడని శ్రీ హక్సర్ వివరించారు.

ఈ సమావేశానికి అధ్యక్షతవహించిన లార్డ్ మవుంట్‌బాటను శ్రీ హక్సర్‌ను సభికులకు పరిచయం చేశారు. భారత ప్రధానమంత్రి వద్ద పరుసగా గొప్ప ప్రతిభతో శ్రీ హక్సర్ పనిచేశారని లార్డ్ మవుంట్‌బాటన్ చెప్పారు.

విదేశాంగ విధానాన్ని గురించిన నెహ్రూ భావం, నేటి ప్రపంచానికి చాలా ఉపయుక్తంగా అమరివున్నదని శ్రీ హక్సర్ అన్నారు.

నేడు సామరస్య వాదంగాని, మామూలు సంబంధాల పునరుద్ధరణ గాని, కొంతవరకు గోచరం అవుతున్నదంటే, నేడు మనము చూస్తున్న సడలింపు పరిస్థితికి నెహ్రూ పలుకుబడిలోని భారతదేశం స్వల్పమాత్రంగానైనా దోహదం కలిగించినందుకు భారతీయులు ఆనందించవచ్చునని శ్రీ హక్సర్ తెలియజేశారు. భారత దేశమనే మత ప్రధానమైన సాంస్కృతిక సమాజాన్ని ఆధునిక జాతిగా తీర్చిదిద్దిన ఘనత నెహ్రూకే దక్కుతుందని ఆయన చెప్పారు.

### జర్మన్‌లో రామాయణం

...ర్లిన్, మే 27 : జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్‌కు చెందిన విక్టర్ మెయినెక్ అనే రచయిత రామాయణ మహాకావ్యాన్ని జర్మన్‌భాషలో వ్రాయటం ప్రారంభించారు.

ఈ రచయిత పిల్లలకోసం అనేక పుస్తకాలను రచించారు. వాటిలో 'బ్యూటీఫుల్ ...' అనే పేరుగల భారతదేశపు కథలసంపుటి ఒకటి ఉన్నది. ఈ కథల సంపుటి ఇటీవలనే ప్రచురింపబడింది.

ఆయన వ్రాసిన చారిత్రక నవల 'ది డెత్ ఆఫ్ ... పైలైన్స్' ఈ ఏడాది ఆఖరులో వెలువడుతుంది. ఈ నవల భారత్‌ను బ్రిటిష్‌వారు పాలిస్తున్న రోజుల్లో బెంగాలీ విప్లవకారులు సాగించిన పోరాటాన్ని ఆధారం చేసుకుని వ్రాయబడింది. శ్రీ మెయినెక్ 1967—1971 మధ్య మూడుసార్లు భారతదేశాన్ని సందర్శించారు.

—:o:—

### హాల్దియా నూనె శుద్ధి కర్మాగారంలో ఉత్పత్తి

న్యూఢిల్లీ, మే 27 : రు 70 కోట్లతో నిర్మించిన హాల్దియా నూనె శుద్ధి కర్మాగారంలో ఇంధన విభాగం వచ్చే నెల నుంచి పని చేస్తుంది. ఇందులో గాసొలీన్, కిరోసిన్, విమానాల ఇంధనం, టర్‌బయిన్‌ల ఇంధనం, హైస్పీడ్ డీసెల్, లిక్విఫైడ్ పెట్రోలియం గ్యాస్, ఫర్నేస్ ఆయిల్ వగైరాలు ఉత్పత్తి కాగలవు.



# చిత్ర విచిత్రం

శ్రీనివాస్

## రచయితకు కొత్తబాధ్యత!

1972లో ఒక కొత్త దర్శకుణ్ణి పరిచయం చేశాడ యీ ఫోటో మనిషి. ఆ చిత్రం అందరి ప్రశంసలకు పాత్రమైంది. నూరు రోజులు ప్రదర్శింపబడింది. ... కలో సాహసం వున్నట్టే, మనిషిలో కూడా నేరింగ్ వున్నది గాబట్టే ఎవరూ వూహించని ఒక వ్యక్తికి దర్శకత్వం యివ్వగలిగాడు. ఆ దర్శకుడు ప్రతిభావంతుడు అని యితడికి ఎప్పు తెలుసు కాబట్టే ఎందరు వాదించినా వినడాయె. చిత్రం విడుదలయిన తరువాత ఆ దర్శకుని ప్రతివాడు మెచ్చుకోవడం జరిగింది.

ఈ ఏడు మరొక వ్యక్తిచేత తన చిత్రాన్ని డైరెక్ట్ చేయిస్తున్నాడు. అతడు సామాన్యుడు కాదు అని యితడికి తెలుసు. అందుకే అయిదు బాధ్యతలను అతనికి అప్పచెప్పాడు. కథను వ్రాయమన్నాడు. మాటలను సమకూర్చమన్నాడు. ట్రీట్‌మెంట్ రాయమన్నాడు. పాటలను పాడగ మన్నాడు. ఇన్ని చేస్తున్న అతనినే దర్శకుడిగా వుండమన్నాడు.

మొన్నీమధ్య ధనుకూడా నాకు వినిపించడం జరిగింది. చదువు గొప్పదా? సంస్కారం గొప్పదా? అనేడి అంశంపై అల్లబడిన కథ వినిపించింది.

ఇంతకీ యీ కొత్తదర్శకుణ్ణి పరిచయం చేస్తున్న వ్యక్తిపేరు కె. రాఘవ అని, దర్శకత్వం చేపట్టిన వ్యక్తిపేరు రాజశ్రీ అని, బ్యానరు పేరు ప్రతాప్ ఆర్ట్స్ (ప్రొడక్షన్స్) అని పాఠకుల బోధ పడాలిగా.

### చిత్ర సమీక్ష: తులసి

పెళ్లి కావలసిన ఆడపిల్లలు ఉన్న మధ్యతరగతి కుటుంబీకులకు ఈ సమాజంలో అన్నీ సమస్యలే. అలాంటి సమస్యలతో సతమతమయిపోయిన ఓ మధ్యతరగతి కుటుంబీకుని, అతని కుమార్తె కథ రామవిజేతా వారి 'తులసి'

ఈ చిత్రంలో తులసి కథానాయిక పేరు. తెలుగువారికి పవిత్రమయినపేరు. కథఅంతా ఎక్కువ భాగం తులసిచుట్టూ అల్లుకొని ఉంటుంది.

తులసిగా ప్రముఖ కన్నడనటి కల్పన ఆ పాత్రను ఎంతో బాగా పోషించింది. శోక సన్నివేశాలలో ఆమె నటన ప్రేక్షకులకు ముఖ్యంగా స్త్రీలకు కంటతడిపెట్టిస్తుంది. పతాక సన్నివేశంలో ఆమె నటన ప్రశంసనీయంగా ఉన్నది.

తులసి తండ్రిగా గుమ్మడి నటనచూస్తున్నప్పుడు మధ్యతరగతి కుటుంబీకుని అవస్థలు కళ్లకు కట్టినట్లు కన్పిస్తాయి. క్వారీ యజమానిగా రావుగోపాలరావు ఆ పాత్రను సమర్థవంతంగా పోషించారు.

ఇతర పాత్రలలో జగ్గయ్య, భారతి, కృష్ణంరాజు, సావిత్రి, రాజబాబు, మోదాలకనం, వరలక్ష్మి ప్రభృతులు ఉన్నారు. స్వర్గీయ ఘంటసాల కూర్చిన బాణీలు చిత్రానికి మంచి ఆకర్షణ. పినిసెట్టి మాటలు భావగర్భితంగా ఉన్నాయి. నేపథ్య సంగీతం రాజేశ్వరరావు సమకూర్చారు.

కె. బాబూరావు డైరెక్ట్ చేసిన తులసి చిత్రం ప్రేక్షకులను ముఖ్యంగా మహిళలను ఆకట్టుకొంటుంది. నిర్మాత కె. ఏ. ప్రభాకర్, విడుదల లక్ష్మీ.

—వెంకటావ్.

## కృష్ణా బేసిన్ ప్రాజెక్టులకు ఎక్కువ నీళ్లు: కేంద్రానికికర్ణాటకవిజ్ఞప్తి

బెంగుళూరు, మే 2[illegible] : కృష్ణా బేసిన్‌లోని ప్రస్తుత ప్రాజెక్టులకు, మున్ముందు నిర్మించే ప్రాజెక్టులకు ఎక్కువ జలాలు కేటాయింపబడేటు చూడవలసిందిగా కర్నాటక ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని కోరింది.

రాష్ట్ర రివెన్యూమంత్రి శ్రీ ఎస్. హచ్చ మస్తిగౌడ నిన్న శాసనసభలో ప్రశ్నలకు ముఖ్యమంత్రి తరపున సమాధానమిస్తూ, 20.84 లక్షల ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం కల్పించేందుకు వీలుగా 442 టి. ఎం. సి. అడుగుల నీటిని వినియోగించుకోవడానికి ఎగువకృష్ణా ప్రాజెక్టు ఉద్దేశింపబడిందని, 155 టి. ఎం. సి. అడుగుల నీటిని యీ ప్రాజెక్టు క్రింద వినియోగానికి కృష్ణా జలాల ట్రిబ్యునల్ హామీ యిచ్చిందని, తన వాటా జలాలలో తిరిగి కేటాయింపు చేసుకునే స్వేచ్ఛను రాష్ట్రానికి ట్రిబ్యునల్ యిచ్చిందని చెప్పారు.

ఇంకిపోయే నీరు 7న్నర శాతం మొదలు 10 శాతం దాకా వుంటుందని అంచనా వేయబడిందని, యీ నీటిని కూడా ప్రభుత్వం ఉపయోగించుకోవచ్చునని, రు. 153 కోట్ల అంచనా ఖర్చుతో కూడిన మొదటి దశలో 103 టి. ఎం. సి. అడుగుల నీటిని వినియోగించుకుని 10 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం కల్పించాలని తలపెట్టామని, యీ మొదటి దశ ఆరవ ప్రణాళికలో పూర్తవుతుందని ఆయన చెప్పారు.

ఈ ఎగువ కృష్ణా ప్రాజెక్టును జాతీయ ప్రాజెక్టుగా చేపట్టాలని, ప్రణాళికకు సంబంధం లేకుండా యీ ప్రాజెక్టుకు కేంద్రం పెట్టుబడిని సమకూర్చాలని రాష్ట్రప్రభుత్వం కేంద్రానికి సమర్పించిన ఐదవ ప్రణాళికలో కోరిందని శ్రీ గౌడ చెప్పారు.

## కృత్రిమ వర్షం కురిపించే యత్నం

వాషింగ్టన్, మే 27 : ఆగ్నేయాసియాలో కృత్రిమవర్షం కురిపించడానికి 21.6 మిలియన్ల డాలర్లు ఖర్చుపెట్టి ఆరు సంవత్సరాలపాటు పెంటాగన్ కృషిచేసిందని, కాని పెద్దగా ఫలితం లభించలేదని గత శనివారం బహిర్గతమైన రహస్య సమాచార పత్రంవల్ల వెల్లడయింది.

మార్చి 20 న సెనెట్ విదేశ సంబంధాల ఉపసంఘానికి అందజేయబడిన ఈ పత్రంలోని సమాచారాన్ని సెనేటర్ క్లెర్‌బర్గ్ బహిర్గతం చేశారు. పెంటగన్ జెట్ విమానాలు 2602 ప్రయాణాలుచేసి కృత్రిమ మేఘాలు సృష్టించినట్టు ఈ పత్రం వెల్లడించింది.

## పుదుచ్చేరి లెఫ్టినెంట్ గవర్నర్‌కు బెదరింపు లేఖలు

కరైకాల్, మే 27 : ప్రభుత్వోద్యోగాలు ఇవ్వడంలో షెడ్యూల్డ్‌కులాలకు న్యాయం చేయవలసిందని అడుగుతూ తనకు బెదరింపులేఖలు అందుతున్నాయని పుదుచ్చేరి లెఫ్టినెంట్ గవర్నర్ శ్రీ చెడ్డీలాల్ మొన్నరాత్రి ఇక్కడ చెప్పారు.

షెడ్యూల్డ్‌కులాలకు చాలాకాలంగా న్యాయం జరుగలేదని కూడా ఆయన నెడుంగాడు సమీపంలో ఏర్పాటైన ఒక బహిరంగ సభలో మాట్లాడుతూ ఆయన అన్నారు. బెదరింపు లేఖలపై పుదుచ్చేరి యువకులు సంతకాలు చేశారని ఆయన వెల్లడించారు.

## న్యూస్‌ప్రింట్, కలర్ ఫిలిం సప్లయి పరిస్థితి

"ఆంధ్రపత్రిక" ప్రతినిధి

హైదరాబాద్, మే 27 : ఆంధ్రప్రదేశ్ వాణిజ్య— పరిశ్రమల మండలుల సమాఖ్య తాలూకు పారిశ్రామిక అభివృద్ధి సంఘం చైర్మన్ శ్రీ సి. వి. సీతారామస్వామి కేంద్ర రేడియో-సమాచారశాఖమంత్రి శ్రీగుజ్రాల్‌ను ఢిల్లీలో కలుసుకుని వార్తాపత్రికలకు న్యూస్‌ప్రింటు సప్లయి, తెలుగు చిత్రాలకు కలర్ ఫిలిం సప్లయి పరిస్థితి గురించి చర్చించారు.

ఇటీవల న్యూస్‌ప్రింట్ పరిస్థితి మరీ జటిలమయిపోయిందని, చిన్న తరహా వార్తాపత్రికలకు కూడా దెబ్బ తగులుతుందని మంత్రి సూచించారు.

కేవలం గతంలో ఎగుమతులు ఎలా జరిగాయి అనేది ప్రాతిపదికగా తీసుకునే పక్షంలో తెలుగు చిత్రాలకు కలర్ ఫిలిం కోటా రాదని, ఈ చిత్రాలకు విదేశీ మార్కెట్ లేదని శ్రీ సీతారామస్వామి మంత్రికి స్పష్టం చేశారు.

ప్రాంతీయ భాషలలో తయారయ్యే చిత్రాలకు కొంత కలర్‌ఫిలిం లభించడానికి వీలుగా నిబంధనలు సవరించబడగలవని శ్రీ గుజ్రాల్ హామీ ఇచ్చారు.

విశాఖపట్టణంవద్ద స్టూడియో నిర్మాణం త్వరగా జరిపించగలమని కూడా చెప్పారు.

## విభజన తగాదా తిరిగి లేవదీసే ప్రయత్నాలు: ముఖ్యమంత్రి నిరసన

బెంగుళూరు, మే 27: కొందరు కాంగ్రెసువాదులు, ఇతర అభ్యుదయ నిరోధకులు రాష్ట్ర విభజన తగాయిదాను తిరిగి లేవెత్తించే ప్రయత్నాలు సాగించడాన్ని ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు తీవ్రంగా నిరసించారు.

శ్రీ వెంగళరావు మా ప్రతినిధితో జరిపిన ఒక గోష్ఠిలో ఆంధ్రప్రదేశ్‌లోని వెనుకబడిన ప్రాంతాలకు ఆర్థిక సహాయం ఇవ్వడం గురించి కేంద్రం చేసివున్న హామీలు పాటించబడగలవా అన్న ప్రశ్నకు జవాబిస్తూ, కేంద్రం తప్పక త్వరలోనే అంచనా వేయబడిన మొత్తాలను ఇవ్వగలదన్న ఆశను వ్యక్తం చేశారు. రాష్ట్ర విభజన తగాయిదా మరియు ఉద్యమం దేశ వ్యాప్త ప్రభావాలను కలిగి వుండగలవని కనుక వాటిని జాతీయస్థాయిలో పరిశీలించవలసి వుంటుందని సూచించారు. పి. సి. సి. అడ్‌హాక్ సంఘం ఎంతకాలం కొనసాగుతుందన్న ప్రశ్నకు శ్రీ వెంగళరావు ఉద్యమం మూలంగా ఎన్నిక వాయిదా పడిందని, ఇప్పుడు సభ్యులను చేర్పించడం జరుగుతోందని, కనుక డిసెంబరు లోగానే ఎన్నిక జరుగుతుందని వివరించారు.

మంత్రివర్గ విస్తరణ తప్పక జరుగగలదని శ్రీ వెంగళరావు స్పష్టం చేశారు. ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ పి. సి. సి. అధ్యక్షులు శ్రీ వీరమాచనేని వెంకటనారాయణపై శ్రీ కొమ్మూరెడ్డి సూర్యనారాయణ (ఎం. పి) ఆరోపణలు ప్రస్తావిస్తూ ఇది పట్టి బెదిరించేనని తోస్తున్నదని, అధిష్ఠానవర్గం ఈ విషయంలో చర్య తీసుకుంటుందని చెప్పారు. కొమ్మూరెడ్డి ఆరోపణ ముఖ్యమంత్రిపై పరోక్షంగా చేస్తున్న "విమర్శ" కాదన్నారు.

శాసన మండలికి నలుగురు కాంగ్రెసు అభ్యర్థులు పోటీలేకుండా ఎన్నికవడం హర్షిస్తూ నిజామాబాదులో పోటీ నామమాత్రమేనని చెప్పారు. జూన్ 19 న శాసన మండలికి ఎన్నిక జరుగుతుందని కూడా స్పష్టంచేశారు.

స్వ. వి.

## పోస్టుకార్డుల రద్దు ప్రశ్నలేదు: కేంద్ర మంత్రి ప్రకటన

బెంగుళూరు, మే 27: పోస్టుకార్డులను రద్దు చేసే ప్రతిపాదన లేదని కేంద్ర కమ్యూనికేషన్ల శాఖమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి నేడిక్కడ పునరుద్ఘాటించారు.

శ్రీ రెడ్డి పత్రికల వారితో మాట్లాడుతూ కర్నాటక రాష్ట్రంలో తంతి,తపాలా సర్వీసుల పని తీరుపై వివరించారు. భారతీయ టెలిఫోన్ పరిశ్రమల ప్రగతి గురించి కూడా వివరించారు.

బెంగుళూరులో టెలిఫోన్ సర్వీసులలోని లోపాలు దశలవారిగా సవరించబడగలవని ఆయన చెప్పారు.

—o:o—

### ఇరాక్ ఇరాన్‌లమధ్య సామరస్యం

న్యూయార్క్, మే 27: ఇరాన్, ఇరాక్‌లు వివాదగ్రస్తంగావున్న తమ సరిహద్దులలోని సైనిక దళాలను ఉపసంహరించుకొనడానికి అంగీకరించాయి.

ఇరాన్, ఇరాక్ సరిహద్దులలో ఈ యేడాది ప్రారంభంలో సంఘర్షణలు జరిగాయి.

## మామిడితోటల పెంపకం విడిగా సంఘం ఆవశ్యకత

ఏలూరు, మే 27 : మూడు రోజులు ఇక్కడ విజయవంతంగా నిర్వహింపబడిన ఆంధ్రప్రదేశ్ మామిడిపండ్ల, మామిడి ఉత్పత్తుల ప్రదర్శనలో 139 రకాల మామిడి పండ్లు, 79 రకాల వూరగాయలు ప్రజలను విశేషంగా ఆకర్షించాయి.

వ్యవసాయశాఖ డైరెక్టరు శ్రీ ఎం. వి. రాఘవన్ అధ్యక్షత వహిస్తూ, మామిడితోటల పెంపకందార్లు ఒక సంఘంగా ఏర్పడవలసిన ఆవశ్యకతను పేర్కొన్నారు. ఆంధ్రప్రదేశ్ మామిడిపండ్ల ఉత్పత్తిలో అగ్రస్థానం వహించినప్పటికీ, సరిఅయిన నిల్వ సౌకర్యములు, ఎగుమతి ఏర్పాట్లు లేకపోవడంవల్ల రైతులు యిబ్బంది పడుతున్నారన్నారు. డాక్టరు శంకర్ శ్రీ రామారావు ముందుగా గీతాపఠనం గావించారు. వ్యవసాయ పథక నిర్వహణాధికారి శ్రీ ధన్వంతరరెడ్డి, గ్రామాలలో మామిడిపండ్ల రకముల పరిశ్రమలు ఏర్పాటు కావాలని విజ్ఞప్తి చేశారు. మామిడి పంటల పరిశోధనాశాల ఆవశ్యకతను వివరిస్తూ శ్రీ పేరిచర్ల భాస్కరరాజు ప్రసంగించారు. కలక్టరు శ్రీ జి. కుమారస్వామిరెడ్డి వచ్చే జూన్‌లో రాష్ట్ర స్థాయిలో పాటోగ్రావుల ప్రదర్శన నిర్వహించ నున్నట్లు తెలిపారు. మామిడి పండ్ల ప్రదర్శన నిర్వహణలో కృషి చేసిన ఎగ్జిబిషన్ సొసైటీకీ, అధికారులకు కృతజ్ఞతలు తెలిపారు. శ్రీమతి నిర్మలా కుమారస్వామిరెడ్డి విజేతలకు బహుమతి ప్రదానం చేశారు.

స్వ. వి.

—:o:—

### కర్నాటక ముఖ్యమంత్రిపై వ్యతిరేక ప్రచారం

కోజికోడ్, మే 27: కర్నాటకలో ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా కాంగ్రెస్ అసంతృప్తి వర్గీయుల ప్రచారం సాగుతున్నదని, పార్టీ ప్రతిష్ట పెరగడానికి, సోషలిస్టు విధానాల అమలుకు తగిన చర్యలు తీసుకొనవప్పుడు ముఖ్యమంత్రి గా శ్రీ అర్స్ పదవీభ్రష్టుడు కాగలడని మాజీ—మంత్రి శ్రీ బసవలింగప్ప ఇక్కడ చెప్పారు. ఈ వ్యతిరేక ప్రచారంలో తాను చేరనప్పటికి, కర్నాటకలో కాంగ్రెస్ ప్రతిష్ట పెరగడం లేదని వారు చేస్తున్న ఆరోపణలతో తాను ఏకీభవిస్తున్నట్లు వివరించారు. ఈ వర్గం అసంతృప్తికి కారణాలు అధిష్టానవర్గానికి ఇంకా చేరలేదన్నారు.

## సుందరకాండ

—యామిజాల పద్మనాభస్వామి

### 59 వ సర్గ

అశ్వపుత్రౌ మహావేగా
వేత్రా ప్లవగసత్తమౌ
పితయో: ప్రతియోద్ధారౌ
న పశ్యామి రణాజిరే 17

యీ మైందద్వివిదుల వృత్తాంతం మనకందరకూ తెలిసినదే. అశ్వినీదేవతల అంశలతో పుట్టినవారు. మహావేగముతో యీ అన్నదమ్ములు విజృంభిస్తే యుద్ధరంగములో వీరిని ఎదిరించి యుద్ధము చేసేవాడు నాకు కనిపించలేదు.

పితామహ వరోత్సేకా
త్పరమం దర్పమాస్థితౌ
అమృతప్రాశినా వేత్రౌ
సర్వ వానరసత్తమౌ

(బ్రహ్మ వరముతో విశిష్ట భుజబలం గల వీరులుగా పేరొందినవారు. అమృతము నాస్వాదించిన అదృష్టవంతులు. వానరులో విశిష్టమూర్తులుగా చెప్పదగినవారు. (మిగిలిన వానరు లందరూ దేవాంశసంభవులే అయినా యీ యిద్దరూ అమృతం త్రాగినవారు కనుక సర్వ వానర సత్తములని హనుమ ప్రశంసించాడు.)

అశ్వినో ర్మాననార్థం హి
సర్వలోక పితామహ:
సర్వావధ్యత్వ మతులం
అనయో ర్దత్తవాన్ పురా

బ్రహ్మ అశ్వినీదేవతల గౌరవార్థం వారి అంశంతో పుట్టిన యీ యిరువురకూ ఎవరివల్లా మృతి పొందని విధంగా అసామాన్యమైన వరం ప్రసాదించాడని పెద్దల మాట.

(వైద్యులకూ, నట, విట, గాయకాదులకూ మాన్యత తక్కువగా ఒక అపవాదు ఉన్నది. అశ్వినీదేవతలు దేవవైద్యులు. వారి అంశతో జన్మించిన మైందద్వివిదులకు 'అవధ్యత్వం' బ్రహ్మ ప్రసాదించాడంటే అశ్వినీదేవతలకు సర్వత్రమాన్యత కలిగించడమే అని—ధ్వని.)

(వశేషం)




## కల్తీ!

పాపభీతిలేని జాతి ఏం చేసినా ఆశ్చర్యపడక్కరలేదన్నాడో పెద్దమనిషి. ఎంతనిజం! అనిపిస్తోందీనాడు. ప్రపంచ వాతావరణం కలుషితం అయిపోతోంది. మానవజీవితం దుర్భరం అయిపోతోంది— ఇది అరికట్టడానికి దారి చూడండోయ్ అంటూ అమెరికా, బ్రిటన్ మొదలైన దేశాలు ఘోషపెడుతున్నాయి. సాల్యూషన్ హో పెద్ద టెంపొన్సిగా తయారవుతోంది. శబ్దం, గాలి భరించరానిదిగా తయారవుతోంది. . . . అంటూ బాధపడిపోతున్నారు విదేశాలలో.

కాని మనదేశంలో ఉప్పుకి తప్పించి దేనికీ విలువలేదని. . . . డబ్బు ఎలా సంపాదించినా— సంపాదించడమే ముఖ్యంగాని ఏదారిన అన్న ప్రశ్నలేదన్నది—నిరూపిస్తోంది మన కల్తీ వ్యాపారం. బెంగాల్‌లో ఆయిల్‌ని కల్తీచేసి కొన్ని లక్షలమందిని అశక్తులను చేశారు వ్యాపారులు. వాళ్ళూచేతులూ చచ్చుబడిపోయి జీవించడమే— ఓ శాపంగా తయారైంది లక్షలాదికి. కాని ఎవరు పట్టించుకున్నారు? హాహాకారాలుచేశారు. పేపర్లలో రాశారు. స్టాకులు జప్తుచేశారు. ఒకరిద్దరు వ్యాపారులని ప్రశ్నించారు. అంతే. ఇప్పుడింక యింకా ప్రాణాపాయం అయినచోట్ల తెగించడానికి వ్యాపారులు దిగజారారు— అవే రోగులు నిర్భయంగా వెళ్లి డాక్టర్ల దగ్గిర పుచ్చుకునే మందులు! డాక్టరుగారు యింజెక్షను ప్రాణం నిలబెట్టడానికిస్తే రోగి చావనా? అందులోనూ గ్లూకోజులాంటి అత్యావసరమైన వాటిని కల్తీచేసి గుండెనిబ్బరంగా వుండి మార్కెట్‌లో దింప కల్గారంటే— యింక వాళ్ళూ మనుషులేనని ఎలా అనుకోవాలి? ఎందుకనుకోవాలి? గ్లూకోజు, బి కాంప్లెక్సు, యిప్పుడింక కొన్ని బాదిం— టెటానస్ టాక్సిన్ నిరుగుడు మందులు—. . . యీ లిస్టు చూస్తు చూస్తుండగా హనుమంతునితోకలా పెరిగేలా వుందేగాని తగ్గడం లేదు. సాస్ట్రడింకుసీసాలో యీగ వుందని పార్లమెంటులో గోల. ముచ్చటగా పెళ్లివారింట యిచ్చిన డ్రింకు త్రాగి తొంభైమందిదాకా ఆస్పత్రిపాలైనారు. . . . ఇంక నమ్మిబజారులో ఏం కొనాలోఅర్థంకాదు. పక్కాపొడిలో చింతపిక్కలపొడి, పసుపులో లెడ్ వేసుస్న కెమికల్, చక్కెరలో రవ్వ, . . . యింక చెప్పకండి— యిక్కడ మొన్న వాడకందారుల కోసం ఓ ప్రదర్శన ఏర్పాటుచేశారు. కన్స్యూమర్స్‌కౌన్సిల్‌వాళ్ళు. . . . ఈ కల్తీచూస్తే భయంవేస్తోంది.

వ్యాపారం చేసుకోవచ్చు. ధరలు పెంచవచ్చు. జనాన్ని కొల్లగొట్టవచ్చు. కాని ఈ దారుణం ఏమిటి? యిలా కల్తీ పదార్థాలు మార్కెట్ చేసి అమ్మడానికి వీళ్ల మనస్సు ఎలా అంగీకరిస్తోంది? వీళ్ళు ఎవరి అండ చూసుకుని ధైర్యంగా యీ రాక్షస కృత్యం చేస్తున్నారు? వ్యాపారానికి కూడా నైతిక సూత్రాలు వుంటాయి. అవి పాటించని వాడు వ్యాపారికాదు. దోపిడీదారు. అలాంటి వాళ్లని నిర్దాక్షిణ్యంగా చంపాలి. అప్పుడే—వారి ఆట కట్టేది. ప్రజల ప్రాణాలతో చెలగాటం ఆడేవ్యక్తి ఎవ్వరైనా. దేశ సౌభాగ్యం కోసం వాళ్లని హతమార్చడం తప్పుకాదు. దొరికిన వాళ్లని ముందు నిర్దాక్షిణ్యంగా కారాగారంలో తోయక— సంజాయిషీలూ, పరీక్షలూ ఏమిటి? కాలయాపన! పిరికి పేడీలువేసి రోడ్లమీద తిప్పినందు వల్ల ప్రయోజనం ఏమిటి? ఇంతింత దారుణాలు తలపెట్టిన వీళ్ళ సిగ్గుపడి చేసిన తప్పులకు పశ్చాత్తాపపడతారనా! అసంభవం. 'ఈ గండంగడిచి బయటపడితే నీ హుండీలో వో లక్ష వేస్తాను' అని మొక్కుకుని కళ్ళు మూసుకుంటారు! దారుణంగా హత్యచేసే వాడికంటే హీనులైన యీ కల్తీవ్యాపారులని ఒకరిద్దరినేనా ఉరికంబం ఎక్కిస్తేగాని— కళ్లు తెరవరు.

## దినఫలం

28-5-1974 మంగళవారం

శక సం. 1896 జ్యేష్ఠమాసం 7

- ★ మేషం:— వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు.
- ★ వృషభం:— అన్ని వ్యవహారాల్లోన ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.
- ★ మిథునం:— అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.
- ★ కర్కాటకం:— విద్యావైజ్ఞానిక రంగాలలో మీ కృషి రాణిస్తుంది. కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి.
- ★ సింహం:— అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభించగలదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.
- ★ కన్య:— కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. మీ కార్యాలు నెరవేరతాయి.
- ★ తుల:— మీ ప్రయత్నాలు ఫలించగలవు. దానానికి సౌఖ్యం తో పెంపొందిస్తాయి.
- ★ వృశ్చికం:— వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి.
- ★ ధనుస్సు:— వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. రావలసిన డబ్బు అందుతుంది.
- ★ మకరం:— సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.
- ★ కుంభం:— భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది.
- ★ మీనం:— ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. ఇతరులనిమిత్తం శ్రమకు గురికాగలరు.

—మహేష్

# కాంగ్రెసు కార్యవర్గ తీర్మానం దృష్ట్యా సమ్మె విరమించండి: రైల్వే సిబ్బందికి రాష్ట్రపతి హితవు

మద్రాసు, మే 27 : రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి నిన్న ఇచ్చట పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ కాంగ్రెసు కార్యవర్గం ఆమోదించిన తీర్మానం దృష్ట్యాను, బోనస్‌సమీక్షా సంఘం త్వరలో తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించ గలదని భావి స్తున్న దృష్ట్యాను రైల్వే సిబ్బంది జాతీయ సమన్వయ సంఘం సమ్మెను ఉపసంహరించే విషయం పరిశీలించవలసిన సమయం వచ్చిందన్నారు.

"సమ్మెను ఉపసంహరించవలసిందిగా జాతీయ సమన్వయ సంఘానికి నేను సలహా ఇస్తున్నాను. పగ సాధింపు వగైరా సమస్యలను ప్రభుత్వం సద్భావంతో పరిశీలించేందుకు ఇలాంటి చర్య తోడ్పడుతుంది" అని ఆయన అన్నారు.

ప్రతినిధివర్గం తమకు సమర్పించిన వినతిపత్రాన్ని ప్రధానమంత్రికి అందజేయ గలనని రాష్ట్రపతి తెల్పారు.

కేంద్రప్రభుత్వం రైల్వే సిబ్బందిలో భయాలద్వారా గౌరవప్రదము, న్యాయము అయిన పరిష్కారానికి వచ్చేట్లు చూడడానికి మరింత గట్టిగా జోక్యం చేసుకొనవలసిందని ఆ వినతి పత్రం రాష్ట్రపతిని కోరింది.

సమ్మె సందర్భంగా అరెస్టు చేయబడిన వారినందరినీ విడుదల చేయించడానికి కేసు లన్నిటినీ ఉపసంహరింపజేయుటానికి, ఖత్తరఫ్ చేయబడిన, సస్పెండ్ చేయబడిన ఉద్యోగులందరికీ తిరిగి ఉద్యోగాలు ఇప్పించుటానికి, రైల్వే సిబ్బందిని వారి కాలనీలనుంచి ఖాళీ చేయించకుండా చూచేందుకు తమ పలుకుబడిని వినియోగించవలసిందని కూడా వినతిపత్రం రాష్ట్రపతిని కోరింది.

రాష్ట్రపతిని కలుసుకొన్న ప్రతినిధి వర్గానికి తమిళనాడు ఎ. ఐ. టి. యు. సి. ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఎం. సుందరం నాయకత్వం వహించారు. శ్రీ సుందరం విలేఖరులతో మాట్లాడుతూ ప్రతిష్టంభనను తొలగించడానికి సాధ్యమయినంత మేరకు సహాయపడగలనని రాష్ట్రపతి హామీ యిచ్చారన్నారు. వినతిపత్రాన్ని తన సిఫారసులతో ప్రధాన మంత్రికి పంపించగలనని కూడా రాష్ట్రపతి తమకు చెప్పారన్నారు.

రాష్ట్రపతి సలహాను ఢిల్లీలోవున్న సి. పి. ఐ. నాయకుడు శ్రీ డాంగేకు తెలియ పరచగలమని శ్రీ సుందరం అన్నారు. అనుకూల ఫలితాలు సంభవించగలవని తాము ఆశిస్తున్నామని ఆయన చెప్పారు.

రాష్ట్రపతి సలహా దృష్ట్యా సమస్యలను చర్చించడానికి జాతీయ సమన్వయ సంఘం పూర్తి సమావేశం జరిగేందుకు వీలుగా అరెస్టయిన నాయకులను విడుదల చేయాలని తమ ప్రతినిధివర్గం విజ్ఞప్తి చేసినదని ఆయన తెలిపారు.

సి. ఐ. టి. యు. నాయకుడు శ్రీ వి. పి. చింతన్, శ్రామిక ప్రజాసమితి నాయకుడు శ్రీ కుచేలర్, డి. ఎం. కె. నాయకుడు శ్రీ గోపాల్ కూడా ప్రతినిధి వర్గంలో వున్నారు.

కార్మిక లోకానికి ముఖ్యంగా ప్రస్తుతం పోరాటం సలుపుతున్న రైల్వే ఉద్యోగులకు న్యాయం జరిగేటట్లు పలుకుబడిని వినియోగించవలసిందిగా వీరు తమ వినతిపత్రంలో రాష్ట్రపతిని అభ్యర్థించారు. కార్మిక నాయకుల పై అంతరంగిక భద్రతా చట్టాన్ని వినియోగించడం పట్ల వినతిపత్రం లో నిరసన తెలిపారు. సమ్మెలో వున్న రైల్వే పనివారిని పనిలో చేరేటట్లు చేయడానికి పోలీసులు బలప్రయోగం చేస్తున్నారని, వేధిస్తున్నారని మగవారు పనికి వెళ్లక పోతే తీవ్ర పరిణామాలు తప్పవని ఆడవారిని బెదిరిస్తున్నారని వినతి పత్రంలో ఆరోపించారు.

రాష్ట్రపతి ఈ వినతిపత్రాన్ని స్వీకరిస్తూ "నేను నా శాయశక్తులా కృషి చేస్తున్నాను. ఈ కృషిని కొనసాగిస్తాను" అని హామీ యిచ్చారని శ్రీ చింతన్ చెప్పారు.

కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానం దృష్ట్యా సమ్మెను యిప్పుడు విరమించడం న్యాయ రీత్యా సముచితం కాగలదని రాష్ట్రపతి సలహా యిచ్చారని ఆయన అన్నారు.

## బొంబాయి శివారు రైళ్ళు: 50 శాతం పైగా నడక

బొంబాయి, మే 27: తను మామూలు శివారు రైలు సర్వీసులలో 50 శాతం పైగా సర్వీసులను నేటినుంచి పునరుద్ధరిస్తున్నట్లు సెంట్రల్, పశ్చిమ రైల్వేలు నిన్న ప్రకటించాయి.

మామూలు రోజుల్లో నడిచే 460 శివారు రైళ్లలోను 345 రైళ్ళను నేటి నుంచి నడపగలమని కేంద్ర రైల్వే వాగ్దానం చేసింది. కాగా మామూలుగా నడిచే 540 శివారు రైళ్లలోను 300 వరకు నేటి నుంచి నడుపగలమని పశ్చిమ రైల్వే తెలియ చేసింది.

బొంబాయి ప్రాంతంలో సిబ్బంది హాజరు పరిస్థితి అద్భుతంగా మెరుగుపడిందని పశ్చిమ రైల్వే ప్రతినిధి అన్నారు.

# పనిలోచేరే రైల్వే సిబ్బందికి శిక్షలు మినహాయింపు

న్యూఢిల్లీ, మే 27 : ఇప్పటికీ పనికి గైరు హాజరవుతున్న రైల్వే ఉద్యోగులకు, అలా గైరు హాజరయినందుకు (మెడికల్ సర్టిఫికెటు లేదు) కానిపక్షం లేకుండానే పనులలో చేరడానికి అనుమతించవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వాలకు సలహా యివ్వడానికి కేంద్ర ప్రభుత్వం నిన్న నిర్ణయించింది.

గైరు హాజరు సందర్భంగా అరెస్టయిన రైల్వే ఉద్యోగులు తిరిగి పనులలో చేరదలచి నట్లయితే వారు ఆ విధంగా చేయడానికీవీలుగా బెయిలు మీద విడుదల సాధించేందుకు పోక ర్యాలు కల్పించవలెనని కూడా కేంద్రం అభిప్రాయపడింది.

## పాస్‌పోర్టు దరఖాస్తు విధానం సవరణ

మద్రాసు, మే 27 : ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటక, పుదుచ్చేరి ప్రాంతాలలో నివసించేవారు పాస్‌పోర్టుల కోసం దరఖాస్తులు పెట్టుకొనడంలో అనుసరించవలసిన విధానాన్ని మద్రాసులోని ప్రాంతీయ పాస్‌పోర్టు వ్యవహారాల కార్యాలయం సవరించింది. కొత్త విధానం ఈనెల27వ తేదీనుంచి అమలులోకి వస్తుంది.

దరఖాస్తుదారులు మద్రాసులోని ప్రాంతీయ పాస్‌పోర్టు వ్యవహారాల అధికారికి మనీ ఆర్డరు ద్వారా రు. 2—50 ు పాస్‌పోర్టులు రుసుము క్రింద రూ. 25లు, పాస్‌పోర్టు పంపడానికయ్యేచార్జి క్రింద రు. 2—50లు పంపాలి. మనీఆర్డరు రసీదును దరఖాస్తుఫారం అసలు ప్రతికి అంటించాలి. దరఖాస్తు ఫారం అసలు ప్రతితో దరఖాస్తుఫారం నకలు ప్రతినీ, పాస్‌పోర్టు సైజులో ఉండే నాలుగు ఫోటో గ్రాఫులనూ, దరఖాస్తుదారుని ఆర్థికస్తోమతను ఋజువుచేసే పత్రం, లేక ఇతరులుఇచ్చే హామీపత్రాన్ని, దరఖాస్తుదారుని చిరునామా వ్రాసివున్న కవరు —20 సెం.మీ × 14 సెం.మీ సూ జతపరచి జిల్లా అధికారులకు సమర్పించాలి. ఈ పత్రాలన్నిటినీ పరిశీలించిన అనంతరం జిల్లా అధికారులు వాటిని తమ నివేదికతోపాటు ప్రాంతీయ పాస్‌పోర్టు వ్యవహారాల అధికారికి పంపుతారు.

—o:o—

## మద్రాసులో మళయాళీ వ్యతిరేక ప్రదర్శన

మద్రాసు, మే 27: తమిళుల హక్కుల రక్షణ సంస్థ సభ్యులు నిన్న ఉదయం ఇక్కడ ప్రదర్శన జరిపిన సందర్భంగా జరిగిన సంఘటనల దృష్ట్యా పోలీసులు 48 మందిని అరెస్టు చేశారు.

పెరియార్ సమాధి నుంచి అన్నా సమాధి వరకు గల ప్రాంతంలో వున్న ఒక సినిమా థియేటరు పైన, ఒక లాడ్జి పైనా కొన్ని దుకాణాల పైనా ప్రదర్శకులు రాళ్ళవర్షం కురిపించారని పోలీసులు చెప్పారు. ప్రదర్శకులు మళయాళీ వ్యతిరేక నినాదాలు చేశారు.

తమిళనాడులో వ్యాపార సంస్థల్లో గాని, రాజకీయ సంస్థల్లో గాని, ప్రభుత్వంలోగాని తమిళేతరుల ప్రవేశాన్ని అనుమతించరాదని పై సంస్థ సభ్యులు అన్నాసమాధి వద్ద ప్రతిజ్ఞ పూనారు. ప్రదర్శకుల దాడికి గురి అయిన సినిమా థియేటరులో మళయాళీ చిత్రాలను ప్రదర్శిస్తుంటారు. థియేటరుల తెరను కూడా ప్రదర్శకులు చించి వేశారు. నిన్న ప్రత్యేకంగా ఒక మళయాళీ చిత్రాన్ని ప్రదర్శిస్తున్న మరోక థియేటరుపై కూడా రాళ్ళవర్షం కురిపించారు.

## కేంద్రంచే పన్నుల వసూలు

న్యూఢిల్లీ, మే 27 : కేంద్ర ప్రభుత్వం 1973—74లో రు 5001.67 కోట్ల రివెన్యూ వసూలు చేసింది. ఆ క్రిందటి సంవత్సరంలో కంటె రు 547.06 కోట్లు అదనంగా వసూలు జరిగింది. వివరాలు యివి: అంకెలు కోట్ల రూపాయలలో —

కస్టమ్సు రు 1016.72, ఎక్సయిజు రు 2633.60, కార్పొరేషన్ పన్ను రు 630.55, ఆదాయం పన్ను రు 647.50, సంపద పన్ను రు647.55, బహుమతి పన్ను రు 4.73, ఎస్టేటు సుంకం రు 11.07, ఇల్లమందువిూద రు 18.66.

## నక్సలైట్ల నిరాహారదీక్ష

కలకత్తా, మే 27 : కలకత్తాలోను, పరిసర ప్రాంతాలలో జైలులో వున్న 98 మంది నక్సలైట్లు ఈ నెల 17 నుంచి నిరాహార దీక్షలో వున్నారు. వీరిలో ఏడుగురి పరిస్థితి తీవ్రంగా వున్నట్లు ప్రజాస్వామ్య హక్కుల సంరక్షక సంఘం ప్రకటించింది. జైలులో రాజకీయ ఖైదీలుగా తమను పరిగణించాలని వారు కోరుతున్నారు.

## రైల్వే సమ్మెపట్ల కేంద్రం వైఖరికి కాంగ్రెస్ ధృవీకరణ

న్యూఢిల్లీ, మే 27 : రైల్వే సమ్మెపట్ల, కార్మిక వర్గాలలో కొందరి కోర్కెలపట్ల కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న రాజీలేని వైఖరిని కాంగ్రెస్ కార్యవర్గం ధృవీకరించింది.

కార్యవర్గం ఆమోదించిన తీర్మానంలో ఇందుకు సంబంధించిన భాగంలో ఇలా ఉంది.

గట్టిగా కోర్కెలు కోరిన కొందరికి కొంచెం కొంచెం మినహాయింపులు ఇవ్వడం, నిర్దిష్ట మైన సంస్థలలోని వారినుంచి వచ్చే కోర్కెలను ప్రతిఘటించడానికి ప్రయత్నం వంటి సర్దుబాటు విధానాలు దీర్ఘకాలంలో మన ఆర్థిక వ్యవస్థలో సహేతుకమైన వేతనాల— ఆదాయాలపద్ధతి రూపొందడానికి సహాయ పడదు."

అందువల్ల రైల్వేసమ్మెపట్ల కేంద్ర ప్రభుత్వం వైఖరిని కాంగ్రెస్‌వర్గం ధృవీకరించింది.

—:o:—

## రైల్వే ఉద్యోగుల నాయకుడు శ్రీ భంగూ అరెస్టు

న్యూఢిల్లీ, మే 27: రైల్వే ఉద్యోగుల జాతీయ సమన్వయ సంఘానికి చెందిన కార్యాచరణ సంఘం సభ్యుడు శ్రీ ఎస్. ఎస్. భంగూను పోలీసులు నిన్నిక్కడ అరెస్టు చేశారు.

రైల్వే ఉద్యోగుల సమాఖ్య ప్రధాన కార్యదర్శి అయిన శ్రీ భంగూను సోషలిస్టుపార్టీ కేంద్రకార్యాలయంలో వుండగా పోలీసులు అరెస్టు చేశారు.

ఈ అరెస్టును సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ సురేంద్రమోహన్, రైల్వే ఉద్యోగుల జాతీయ సమన్వయ సంఘంవారు ఖండించారు.

### మంత్రి శ్రీ చనుమోలు

హైదరాబాద్, మే 27 : మంత్రి శ్రీ చనుమోలు వెంకటరావు ఈనెల 28 న బలుసుపాడు, ముప్పాల వెడతారు. 29—30 తేదీలు కృష్ణా జిల్లాలో పర్యటిస్తారు.

# వెనుకబడిన తరగతుల జాబితా: లోపాల సవరణకు ముఖ్యమంత్రి హామీ

"ఆంధ్రపత్రిక" ప్రతినిధి

హైదరాబాదు, మే 27 : రాష్ట్రంలో వెనుకబడిన తరగతుల జాబితా లోగడ తయారు చేసినప్పుడు కొన్ని తరగతుల ప్రజలకు జరిగిన అన్యాయాన్ని తొలగించే విషయం ప్రభుత్వ పరిశీలనలో ఉన్నట్లు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు నిన్నిక్కడ చెప్పారు.

ఆంధ్రప్రదేశ్ చతుర్థ ముదిరాజు సమ్మేళనానికి ఆయన ఎగ్జిబిషన్ మైదానంలో ప్రారంభోత్సవం చేస్తూ, వెనుకబడిన తరగతుల, జాతుల కార్పొరేషన్ వచ్చేవారం పది రోజులలో ఏర్పాటు కానున్నదని ఆయన ప్రకటించారు. ఈ రోజే తాము ఈ సంస్థ రాజ్యాంగంపై సంతకం చేశామన్నారు.

వెనుకబడిన తరగతుల జాబితాలో ముదిరాజులను చేర్చలేదన్న ఫిర్యాదుకు ఆయన జవాబిస్తూ ఈ జాబితా తయారీకి నియమింపబడిన కమిషన్ హైదరాబాద్ నగరంలో బెల్లం బట్టలు వేసుకున్న కొందరు ముదిరాజులను చూచి ఈ తరగతిని బహుశా వదలివేసినట్లు కనిపిస్తుందని వ్యాఖ్యానించారు. నిజానికి ముదిరాజులు, ఇతర అనేక వర్గాలవారు గ్రామాలలో నికృష్టంగా బ్రతుకుతున్నారని ఆయన వివరం వెలిబుచ్చారు.

వెనుకబడిన వర్గాల శీఘ్రతర అభ్యున్నతే కాంగ్రెసు పార్టీ లక్ష్యమని, ఈ లక్ష్యాన్ని మాటలతో సంతృప్తి పరచకుండా రాష్ట్ర ప్రభుత్వం చేతులలో చూపుతుందని ఆయన హామీ యిచ్చారు. ప్రధానమంత్రి వాగ్దానాలను అక్షరాల అమలు చేయాలన్నదే తమ ఏకైక ధ్యేయమని ముఖ్యమంత్రి చెప్పారు.

ఇళ్లులేని వెనుకబడిన వర్గాల కోసమని కేంద్ర ప్రభుత్వం ఇటీవల కేటాయించిన రు 32 లక్షలతో రాష్ట్రంలో ప్రయోగాత్మక ప్రాతిపదికపై హైదరాబాద్, ఆదిలాబాద్ జిల్లాలను ఎన్నికచేసి అక్కడ భూములుకొని వారికి ఇవ్వడం జరుగుతున్నదని ముఖ్య మంత్రి తెలియచేశారు.

### బంజర్ల పంపిణీ

రాష్ట్రంలోని బంజరు భూములను వచ్చే ఆరు నెలల్లో ప్రత్యేక సిబ్బంది సహాయంతో పూర్తిగా పంపకం చేసివేయగలమని ఆయన అన్నారు.

వెనుకబడినవర్గాలు షెడ్యూల్డు జాతుల ప్రజలు తమకు అన్యాయం జరిగితే నిర్భీతిగా ప్రభుత్వం దృష్టికి తేవచ్చుననీ తమ ప్రభుత్వం వారికి ఉపకారం చేస్తుందని ఆయన హామీయిచ్చారు.

వెనుకబడిన వర్గాల కొరకు ఉద్దేశించిన రిజర్వేషన్లు అమలు కావడంలేదనే విమర్శ దృష్ట్యా, పర్యవేక్షణ కొరకు ప్రభుత్వం ప్రధాన కార్యదర్శి అధ్యక్షతన ఒకప్రత్యేక సంఘం వేయబోతున్నట్లు కూడా ఆయన పేర్కొన్నారు.

నీటిపారుదల శాఖమంత్రి శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తినాయుడు ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు.

ప్రారంభంలో మాజీ మేయరు ఎస్. లక్ష్మీనారాయణ శాసన సభ్యుడు ముదిరాజు ప్రజల అర్థికాభ్యున్నతికి ప్రభుత్వం చిత్తశుద్ధితో సహాయపడాలని అర్థించారు. శ్రీ కె. నారాయణరావు స్వాగతం చెప్పారు.

# శక్తివంతమైన అణ్వస్త్రాల ఉత్పత్తికి చైనా కృషి

పెకింగ్, మే 27 : అణ్వాయుధాలను ఆత్మరక్షణకు తప్ప వినియోగించబోమని చెబుతూనే చైనా అత్యంత శక్తివంతమైన అణ్వాయుధాలను నిర్మించటానికి దృష్టి కేంద్రీకరించింది.

ఒక శతాబ్దంగా సింకియాంగ్ ప్రాంతంలో చైనా అనేక అటంబాంబులను, హైడ్రోజన్ బాంబులను పరీక్ష చేసింది. ప్రస్తుతం 6000 మైళ్ల దూరంలో గల లక్ష్యాన్ని కొట్టటానికి అవసరమైన రాకెట్లను ఉత్పత్తి చేయటంలో చైనా నిమగ్నమై వున్నదని పరిశీలకులు భావిస్తున్నారు.

పోయినవారం అణుబాంబులను తీసుకు వెళ్లగల ఖండాంతర రాకెట్‌ను పైన ప్రయోగించబడింది. అయితే ఈ ప్రయోగం గురించి ఎట్టి అధికార ప్రకటన వెలువడలేదు.

తనకు తానుగా ఏ దేశంపైననూ అణ్వస్త్రాన్ని ప్రయోగించనని అంటున్నది. అగ్రరాజ్యాలకున్న ఆధిక్యతను విచ్ఛిన్నం చేయుడానికి చివరకు మొత్తం అణ్వస్త్రాలను నాశనం చేయుటానికి వీలుకలిగించేందుకే తాను అణ్వస్త్రాలు ఉత్పత్తి చేస్తున్నట్లు పెకింగ్ వాదిస్తున్నది.

భారత్ జరిపిన అణ్వస్త్ర పరీక్షలపై చైనా అధికారికంగా యింతవరకు వ్యాఖ్యానించలేదు. ఈ పరీక్షకు చైనా సిద్ధాంతరీత్యా వ్యతిరేకి చబోదని, అయితే తమకు అగ్ర శత్రువు అయిన రష్యాకు మిత్ర దేశానికి భారత్‌కు అణుశక్తి వుండటం చైనాకు కొంత చికాకు గలిగించవచ్చునని పరిశీలకులు అంటున్నారు.

# భారత్‌లో అణుశక్తి పరిశోధనలు: అంతర్జాతీయ సంస్థ ఆరోపణ

న్యూయార్క్, మే 27 : అణుశక్తి పరిశోధన యంత్రాలను తనిఖీ చేయడానికి వెళ్లిన అంతర్జాతీయ అణుశక్తి సంస్థ అధికారులకు యంత్రాలు చూపించడంలో భారత ప్రభుత్వం సక్రమంగానే వ్యవహరించినదని ఈ సంస్థకు చెందిన సన్నిహితవర్గాలవారు చెప్పారు.

అంతర్జాతీయ అణుశక్తి సంస్థ వియన్నాలో ఉన్నది. ఈ సంస్థ వర్గాలు పంపిన సమాచారాన్ని 'న్యూయార్క్ టైమ్స్' పత్రిక వెల్లడించింది.

భారత ప్రభుత్వం అణుశక్తి కర్మాగారంలోని ఒక హాలులో సగభాగంలో పని చేస్తున్న యంత్రాలను మాత్రమే అంతర్జాతీయ తనిఖీ అధికారులకు చూపించేదని మిగతా సగభాగం మూసివేయబడి ఉండేదని ఈ వర్గం వారు తెలియ జేశారు.

కెనడా నుంచి దిగుమతి చేసుకునే వస్తువులు, ఇతర యంత్ర సామగ్రిని తనిఖీ చేయాలన్న నిబంధన ఒప్పందంలో ఉన్నది. భారత్‌లో తయారైన యంత్రాలనుగాని వస్తువులను గాని తనిఖీ చేయడానికి అంతర్జాతీయ సంస్థకు అధికారంలేదు. ఇందువల్ల భారతీయులు యురేనియంను స్వయంగా తయారు చేసుకోగలిగారు.

అమెరికా, కెనడాల నుంచి దిగుమతి చేయబడిన వస్తువులతో ఏర్పాటు చేసిన కొన్ని రియాక్టర్లు భారత్‌లో ఉన్నవి. ఇవికాక మరి కొన్ని రియాక్టర్లు కూడా భారత్‌లో ఉన్నవి. కెనడా సరఫరా చేసిన ట్రాంబేలోని థర్మల్ రియాక్టర్‌ను భారత్ రెండవ జాబితా రియాక్టరులోనే చేర్చిందని ఇటీవల జరిగిన అణుశక్తి పరీక్షలో ఉపయోగించిన ప్లుటోనియం ట్రాంబే రియాక్టరులోనే తయారు చేయబడిందని అంతర్జాతీయ అణుశక్తి సంస్థవారు ఆరోపించారు.

భారతదేశం అణుశక్తి పరీక్ష జరుపబోతున్నదని ఈ సంస్థ ఇదివరకే ఐక్యరాజ్యసమితికి తెలియజేసిందట. కాని అణ్వస్త్ర వ్యాప్తి నిరోధక ఒప్పందంపై భారత్ సంతకం చేయనందున, అంతర్జాతీయ తనిఖీ పరిధిలో రియాక్టరులో ప్లుటోనియం తయారు అయినందున అంతర్జాతీయ సంస్థ నిస్సహాయ స్థితిలో ఉండిపోవలసి వచ్చిందని 'న్యూయార్క్ టైమ్స్' వ్రాసింది.

—o:o—

### డ్యూక్ ఎల్లింగ్టన్ మృతి

న్యూఢిల్లీ, మే 27 : ప్రసిద్ధ జాజ సంగీతకారుడు ఎడ్వర్డ్ కెనడీ—డ్యూక్ ఎల్లింగ్టన్ నిన్న కొలంబియా ఆసుపత్రిలో మరణించారు. వయస్సు 75.

### విజయనగరం సహకార బ్యాంకు వజ్రోత్సవం

హైదరాబాద్, మే 27 : సహకార శాఖా మంత్రి శ్రీ బత్తిన సుబ్బారావు జూన్ 2న విజయవాడ నుంచి రైలులో విజయనగరం వెళ్లి, అక్కడ స్థానిక సహకార టవును బ్యాంకు వజ్రోత్సవములో పాల్గొంటారు.

—:o:—

### శ్రీ ఆల్తి బంగారయ్య మృతి

విజయనగరం, మే 27 : స్థానిక ప్రముఖ ఇత్తడి వర్తకుడు శ్రీ ఆల్తి బంగారయ్య హృద్రోగంతో ఈ నెల 21 మధ్యాహ్నం కాలధర్మం చెందారు. వయస్సు 60. భార్య తల్లి, కుమారుడు, కుమార్తెలు వున్నారు.

# 28న బీహార్ శాసనసభా కాంగ్రెసుపార్టీ సమావేశం

పాట్నా, మే 27: నాయకత్వం సమస్యపై చర్చ జరిపేందుకు బీహార్ శాసన సభా కాంగ్రెసు పార్టీ మే 28 వ తేదీన సదాఖత్ ఆశ్రమంలో పి.సి.సి. ప్రధాన కార్యాలయంలో సమావేశమవుతుందని ప్రధాన కార్యదర్శి శ్రీ శ్రీకాంత్ నిన్న ప్రకటించారు.

ఆ సమావేశానికి ప్రత్యేక ఆహ్వానితులుగా దేశీయాంగమంత్రి శ్రీ ఉమాశంకర్ దీక్షిత్ రైల్వే మంత్రి శ్రీ ఎల్. ఎన్. మిశ్రా, ఎ. ఐ. సి. సి. ప్రధాన కార్యదర్శి శ్రీమతి ఎం. చంద్రశేఖర్, పార్లమెంటు సభ్యుడు శ్రీ యశపాల్ కపూర్ హాజరవుతారు.

నాయకత్వం సమస్యను చర్చించడానికి ఇంతకు ముందు జరుగవలసిన శాసనసభా పార్టీ సమావేశం కాంగ్రెసు అధిష్ఠాన వర్గం జోక్యం ఫలితంగా వాయిదా పడింది.

## మితవాదపార్టీల సమావేశం వాయిదా

న్యూఢిల్లీ, మే 27 : సోషలిస్టు పార్టీ చొరవతో నేడు జరుగవలసి ఉన్న మితవాద పక్షాల సమావేశం వాయిదా పడింది.

రవాణా యిబ్బందుల వలన కొన్ని పార్టీల ప్రతినిధులు యీ సమావేశానికి రాలేక పోవటంచేత సమావేశం వాయిదా పడినట్లు సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ సురేంద్ర మోహన్ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ సమావేశం వచ్చే నెలలో జరుగుతుంది.

# భారత్ అణుపరీక్ష: జపాన్ పార్లమెంటు నిరసన

టోక్యో, మే 27: మే 18వ తేదీన భారత్ జరిపిన అణు పరీక్షకు నిరసన తెలిపే తీర్మానాన్ని జపాన్ పార్లమెంటులో ఎగువ సభ నేడు ఏకగ్రీవంగా ఆమోదించింది. ఇట్టి తీర్మానాన్ని దిగువ సభ యిదివరకే ఆమోదించింది.

ఎగువ సభ ఆమోదించిన తీర్మానంలో భారత్ ఏ కారణం చేత యీ పరీక్షను జరిపినప్పటికీ యీ పరీక్ష వలన అణు పరీక్షల పోటీ పెరిగి మానవాళి నాశనమయ్యే ప్రమాదం సంభవించగలదని పేర్కొన్నారు.

ఏ దేశమైన అణు అస్త్రాలను ఉత్పత్తి చేయటం, పరీక్ష చేయటం, నిల్వ చేయటాలను జపాన్ ప్రభుత్వం ప్రతిఘటించాలని ఆ తీర్మానం కోరింది.

## అగ్నిప్రమాదం లేని పాకలు

నెల్లూరు, మే 27 : కావలిరూరు ప్రాంతంలో ఈ మధ్య జరిగిన సంఘర్షణలలో కొన్ని హరిజన కుటుంబాల పాకలు దగ్ధం చేయబడ్డాయి. వారికి ఇప్పుడు అగ్ని ప్రమాదాలను లోనుకాని పాకలను నిర్మించి ఇవ్వగలమని జిల్లాకలెక్టరు ఇక్కడ విలేకరులకు చెప్పారు.

పాకలకు వేసే ఆకులు, వాసాలు గడ్డిమీద ప్రత్యేక రసాయనాలు చల్లి నిర్మాణానికి వినియోగిస్తారని కూడా ఆయన వివరించారు.

—:o:—

## రాజమండ్రి జైలులో రైల్వే కార్మికుల నిరసనదీక్ష

రాజమండ్రి, మే 27 : [illegible]

## కల్తీదారులతో అధికారుల కుమ్మక్కు

న్యూఢిల్లీ, మే 27 : కల్తీ సరుకులధరలు కూడా విపరీతంగా పెరిగి పోతున్నట్లు పని ముందారుల మండలి నిన్న పేర్కొన్నది.

ఇటీవల యీ మండలి జరిపిన సర్వేలో గోధుమపిండి, పాదర్లు, మందులు, పప్పులు మొదలైన సరుకులలో విశేషమైన కల్తీ జరుగుతున్నట్లు తేలింది. ప్రభుత్వ శాఖ ఉద్యోగులే కల్తీదారులకు అండగా ఉండటం చేత కల్తీదారులకు భయం ఉండటం లేదని కూడా యీ సర్వేలో బయటపడింది.

రైల్వే సమ్మె మూలంగా దాదాపు అన్ని అత్యవసర సరుకులు మార్కెటులో లభించకుండా పోతున్నాయి. అయితే దొంగ ధనం వున్నవారు మాత్రం విపరీతమైన ధర యిస్తుంటారు కాబట్టి వారికు ఏ వస్తువైనా బ్లాక్‌మార్కెట్టులో దొరుకుతున్నదని యీ సర్వేలో తేలింది.

[illegible]

## ప్రధాన న్యాయమూర్తిగా శ్రీ వోబులరెడ్డి : జూన్ 1 న ప్రమాణ స్వీకారం

ఆంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాద్, మే 27: ఆంధ్రప్రదేశ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఎస్. వోబుల రెడ్డి ఆంధ్రప్రదేశ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా జూన్ ఒకటవ తేదీ ఉదయం 8 గంటల 35 నిముషాలకు ప్రమాణ స్వీకారం చేస్తారు. ఆంధ్రప్రదేశ గవర్నర్ శ్రీ ఖండూభాయ్‌దేశాయ్ వారి చేత ప్రమాణం చేయిస్తారు.

శ్రీ వోబులరెడ్డి నిన్న రాత్రి విమానంలో బెంగుళూరునుంచి ఇక్కడకు వచ్చారు.

ఈ వేళ అనేక మంది న్యాయవాదులు అధికారులు, అనధికారులు ప్రముఖులు [illegible]

### మంత్రి శ్రీ బత్తిన

[illegible]

## 14 మందిసజీవదహనం

[illegible]

## ట్రక్కులో రూ. 50 లక్షల విలువగల వెండి

న్యూఢిల్లీ, మే 27 : కస్టమ్స్ అధికారులు నిన్న ఇక్కడ ఒక ట్రక్కును సోదాచేసి పల్లెటూరి ట్రక్కులో రహస్యంగా దాచబడిన 50 లక్షల రూపాయల విలువయిన వెండిని స్వాధీనం చేసుకున్నారు.

ముందుగా సమాచారం అందినందున, తమ శాఖలోని నిఘా విభాగం జరిపిన [illegible] నిన్న ఈ వెండి పట్టుబడిందని అధికారులు తెలిపారు. ఇతర వివరాలను వెల్లడించడానికి వారు నిరాకరించారు.

[illegible]

## ముఖ్యమంత్రితో వి. వి. సి అధ్యక్షుని సంప్రతింపులు

హైదరాబాద్, మే 27 : [illegible]

## ఆస్తమయం



విజయనగరం పట్టణ ప్రముఖ యిత్తడి వ్యాపారస్తులు శ్రీ వెంకటరమణ మెటల్ ఇండస్ట్రీస్ మెయిన్ పార్ట్నరు శ్రీ ఆల్తి బంగారయ్యగారు హృద్రోగముచే తేది 21.5.74 మంగళవారం మధ్యాహ్నము గం. 3.30లకు తన భార్య, కుమారుడు, కుమార్తెలు, బంధుమిత్రులను దుఃఖసాగరములో ముంచి దివంగతులైరి. పెద్ద కర్మ తే. 29.5.74దిని వారి స్వగృయమందు గాజులరేగలో జరుపబడును.

ఇట్లు,

కుమారుళ్లు : ఆల్తి వెంకటరమణ, ఆల్తి నాగరాజు, భార్య : ఆల్తి ఆదెమ్మ, తల్లి : ఆల్తి సీతమ్మ, కోడలు : ఆల్తి అప్పయమ్మ, కుమార్తెలు : జమ్ము పైడిరాజు, పత్తిగిల్లి మంగరాజు, అల్లుళ్లు : జమ్ము గణపతి, పత్తిగిల్లి వెంకటరమణ, బావగారు : చందక నరసింహులు.

## నియామక విధానాలు, ఎన్నిక పద్ధతులపై సంఘం
## యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్

ప్రస్తుతం అమల్లో ఉన్న నియామక పద్ధతిని పునః పరిశీలించేందుకు యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఈ క్రింద సభ్యులతో ఒక సంఘాన్ని నియమించింది:—

డాక్టర్ డి. ఎస్. కొఠారి. చేర్మన్, శ్రీ జి. పార్థసారధి,
శ్రీ భగవాన్ సాహి, డాక్టర్ ఎం. ఎల్. ధర్,
ప్రొఫెసర్ ఎస్. చక్రవర్తి, ప్రొఫెసర్ ఎం. వి. మాథుర్

పరిశీలనాంశాలలో:—

ఐ. ఏ. ఎస్. వగయిరా పరీక్ష పథకాల పరిశీలన భారతీయ భాషలను పరీక్ష భాషగా ఉపయోగించే పద్ధతులు, వ్యక్తిత్వ పరీక్షలో పరిపూర్ణత్వము పరీక్షల సబ్జక్టులలో మార్పులు చేర్పులు

సెంట్రల్ సర్వీసులకు, క్లాసు I, క్లాసు II ఉద్యోగములకు డైరెక్ట్ రిక్రూట్మెంట్ విధానము పునః పరిశీలన నియామకాలుత్వరితం చేసేందుకు సూచన లివ్వడం, శాస్త్రీయమైన, సాంకేతికమైన ఉద్యోగములకు నియామక పద్ధతులు

పై విషయాలలో సూచనలు, అభిప్రాయాలు కోరబడుచున్నవి:
ప్రజలలో ఆసక్తిగలవారెవరైనను ప్రశ్నావళిని —
డి ఆర్ కోహ్లి, సెక్రెటరీ,
కమిటీ ఆన్ రిక్రూట్మెంట్ పాలసీ అండ్ సెలక్షన్ మెథడ్స్,
యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్,
ధోల్పూర్ హౌస్, న్యూఢిల్లీ—110011 వారి నుండి పొందవచ్చును
ప్రశ్నావళి కొరకు అభ్యర్థనలను 15 జూన్ 1974 తేదీ లోపుగా పంపవలయును

DAVP 560 (9) 74

## ఆంధ్రా యూనివర్శిటి — ప్రకటన

1974 మే 20న ప్రారంభము కావలసి ఉండిన ఈ క్రింద తెలియ బర్చిన పరీక్షలు, ఈ దిగువ తెలిపిన తేదీలలో ప్రారంభము కాగలవని యిందుమూలముగా తెలియపరచడమైనది

| | | |
|---|---|---|
| విద్యాప్రవీణ—ప్రిలిమినరి | 4 జూన్ 1974 | 2గం నుండి 5గం |
| భాషాప్రవీణ—ప్రిలిమినరి | 4 జూన్ 1974 | 2గం నుండి 5గం |
| భాషా ప్రవీణ కోర్సుకు ప్రవేశ పరీక్ష | 4 జూన్ 1974 | 2గం నుండి 5గం |
| మ్యాట్రిక్‌తో డిప్లొమా కోర్సు | 4 జూన్ 1974 | 2గం నుండి 5గం |
| బి.ఎస్‌సి., 3 సం న్యూ స్కీము జియాలజీ—4వ పేపరు | 3 జూన్ 1974 | 8గం. నుండి 11గం. |
| బి. ఎస్‌సి., 3 సం. న్యూస్కీము జియాలజీ—5వ పేపరు | 4 జూన్ 1974 | 8గం. నుండి 11గం. |
| బి. ఏ. 3 సం. న్యూస్కీము సోషియాలజీ—4వ పేపరు | 3 జూన్ 1974 | 8గం. నుండి 11గం. |
| బి. ఏ. 3 సం. న్యూస్కీము సోషియాలజీ—5వ పేపరు | 4 జూన్ 1974 | 8గం. నుండి 11గం. |

విద్యాప్రవీణ ఫైనల్, భాషా ప్రవీణ ఫైనల్, పి ఒ ఎల్ పరీక్షల తేదీలలో మార్పులేదు. ఈ పరీక్షలు లోగడ ప్రకటించిన కార్యక్రమము ప్రకారము జరుగును. ఇందుకు సంబంధించినఅభ్యర్థులు, తాము దరఖాస్తు చేసిన కేంద్రముల చీఫ్ సూపరింటెండెంట్‌లనుండిమార్పుచేసిన టైమ్ టేబుల్ కాపీలను పొందవచ్చును.

యూనివర్శిటీ ఆఫీసు, వాల్తేరు, తేది 23.5.1974.

సి. హెచ్. శ్రీరామమూర్తి, కంట్రోలర్ ఆఫ్ ది ఎగ్జామినేషన్స్.

## Bharat Heavy Plate and Vessels Limited

(పి. ఒ) బి హెచ్. పి. వి, విశాఖపట్నం - 530012

Tender notice No BHPV/T–CM/1076/74–75

ఈ క్రింది పనికి కంట్రాక్టర్లనుండి సీలువేసిన టెండర్లు కోరబడుచున్నవి.

| పని వివరములు | టెండరు అంచనా విలువ | ధరావతు | టెండరుస్వీకరించు ఆఖరు తేది | సెడ్యూల ఖరీదు |
|---|---|---|---|---|
| 1. బి. హెచ్. పి. వి. టవున్ షిప్‌లో రెసిడెన్షియల్ మరియు నాన్ రెసిడెన్షియల్ బిల్డింగ్‌ల మెయింటెనెన్స్ పని (వెల్ల వేయుడం, కలర్ వాషింగ్). | రూ. 39550 | రూ. 1000 | 10—6—74 | రూ. పై 10—00 |

టెండర్లు, ఇతర వివరములను తేది 1—6—1974 మొదలు 7—6—74 వరకు టెండరు సెడ్యూలు ఖరీదు చెల్లించి మెయింటెనెన్స్ మేనేజర్, భారత్ హెవీ ప్లేట్ అండ్ వెజల్స్ లిమిటెడ్, విశాఖపట్నంవారి ఆఫీసులో పొందవచ్చును. టెండరు సెడ్యూలు కొరకు పంపే అభ్యర్థనతో, పూర్వానుభవము సూచించు సర్టిఫికేటును మరియు ఇదే ప్రమాణంలో లోగడ నిర్వహించిన పని వివరములు తెలియపరచవలెను.

టెండర్లు స్వీకరించుటకు ఆఖరు తేది 10—6—1974 సా. 3 గంటలు. టెండర్లు అదే రోజు సా. 3.30 గంటలకు హాజరయిన టెండరర్ల సమక్షములో తెరువబడును.

ఏ కారణము చెప్పకుండా ఏ టెండరునైనను లేక అన్ని టెండర్లను నిరాకరించు హక్కు మెయింటెనెన్స్ మేనేజరుచే రిజర్వు చేసుకొనడమైనది.

సి. డేవిడ్‌రాజు,
మెయింటెనెన్స్ మేనేజరు.

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.



## శ్రీ సింహాచలం దేవస్థానము

Rc.No.2072/74/A3 dt. 17-5-74

టెండరు నోటీసు

విశాఖపట్నం జిల్లా డిటో తాలూకా సింహాచలం గ్రామంలో యున్న సింహాచలం దేవస్థానం కార్యనిర్వహణాధికారి వారి కార్యాలయమునకు 1974—75 సం.నకు కావలసిన స్టేషనరీ సామానులు, అచ్చు ఫారములు, రిజిష్టరులు వగైరా సరఫరా చేయుటకు దేవస్థానము వారి షరతులకు లోబడి సీల్డు టెండర్లు కార్యాలయమునకు తే8.6.1974ది సాయంకాలము గం. 4—00 లోగా చేరునట్లు కోరబడుచున్నవి. టెండరు షరతులు సరఫరా చేయవలసిన టిక్కెట్లు, ఫారములు, వాటి నమూనాలు వగైరా విషయములు టెండరుదార్లు ఆఫీసు పనిచేయు కాలములో స్వయముగా వచ్చి భోగట్టా తీసుకొనవచ్చును.

టి. ఎస్. ఎస్. యన్. రాజు,
కార్యనిర్వహణాధికారి,
సింహాచలం దేవస్థానం.
సింహాచలం, తేది. 17.5.1974



# భారత్‌కు సమితి బాలల సహాయ నిధి నుంచి కేటాయింపు: పాక్ వక్రభాష్యం

ఐక్యరాజ్యసమితి, మే 27 : భారత్‌కు ఐదుసంవత్సరాలలో 568 లక్షల అమెరికన్ డాలర్ల మేరకు సహాయం అందించడానికి ఐక్యరాజ్యసమితి బాలల సహాయనిధి కార్యక్రమ సంఘం ఇటీవల నిర్ణయించింది.

భారత్ కొద్దిరోజుల క్రితం అణుశక్తి పాటవ పరీక్ష జరిపినందున, సహాయం పొందే దేశంగా భారత్ ప్రతినిత్తిలో ఏదైనా మార్పు వచ్చిందా? అని పాకిస్తాన్, ఫిలిప్పీన్స్ ప్రతినిధులు ప్రశ్నించారు.

ఈ సమావేశం రహస్యంగా జరిగింది. ఫిలిప్పీన్స్, పాకిస్తాన్ ప్రతినిధులు ప్రసంగిస్తూ భారత్ అణుశక్తి పాటవ పరీక్ష జరిపినందువల్ల ప్రధానమైన రాజకీయ సమస్య ఒకటి [illegible], అయితే దానిని ఈసంఘం పరిష్కరించజాలదని అన్నారు.

భారత ప్రతినిధి శ్రీ పి. ఎస్. ల్హాద్రా సమావేశంలో ప్రసంగాలన్నీ శ్రద్ధగా ఆలకించారేగాని నోరు విప్పి ఒక్క పలుకైనా పలుకలేదు.

ఫిలిప్పీన్స్ ప్రతినిధి శ్రీ [illegible] తన ప్రసంగంలో ఇలా పేర్కొన్నారు.

''భారత్ వచ్చే ఐదేళ్లలో సమితి బాలల నిధినుంచి నిధిలోని 12 వ శాతం సహాయంగా పొందవలసి వుంది. నియమావళి ప్రకారం మొత్తము ఆర్థిక సహాయంలోని ఆరుశాతం మించి ఏ దేశానికి [illegible].

పోతే ఇందులో రాజకీయ సమస్య ఒకటి వుంది. సమితి విశేష సహాయం అంతర్జాతీయ శాంతి భద్రతల రక్షణకు విరుద్ధ మన్నతం చేసేలా ఆలోచించవలసి వుంటుంది.

సమితి ఉన్నత సంస్థలు ఈ విషయంపై తప్పక ఆలోచించగలవని అనుకొంటున్నాను. ఆ తర్వాత సమితి ఒక నిర్ణయం చెయ్యవలసి వుంటుంది. ఈలోగా ఈ సమస్యను సమితి సంస్థలన్నీ ఒకకంట కనిపెట్టివుండాలి''

పాకిస్తాన్ ప్రతినిధి శ్రీ హయత్‌మెహ్దీ ప్రసంగిస్తూ ''భారత్, మరికొన్ని దేశాలు [illegible]. [illegible] బాలల సహాయనిధినుంచి కేటాయింపులు [illegible] రోజుల క్రితం ఉన్నట్టి పరిస్థితులుబట్టి జరిగాయి. [illegible] పరిస్థితులు మారాయి. అందువల్ల ఫిలిప్పీన్స్ ప్రతినిధి వ్యాఖ్యకు చాలా ప్రాధాన్యంవుంది'' అని అన్నారు.

### ఖమ్మం మాజీ నేరస్థుల సంఘం

ఖమ్మం, మే 27 : ఖమ్మం జిల్లాలో మాజీ నేరస్థుల [illegible] 40 మంది మాజీ నేరస్థులకు [illegible] కల్పించాలని జిల్లా [illegible] గత గురువారం నాడు జరిగిన సమావేశంలో నిర్ణయించింది.

మాజీ నేరస్థుల గృహాలలో [illegible] ఖమ్మంలో ఏర్పాటు చేయవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరటానికి కూడా సమావేశం నిర్ణయించింది.

### ప్రకటన

నా [illegible] పూర్ణచంద్ర [illegible], విజయవాడ—తనకుగల [illegible] 250 గజముల [illegible] (గుంటూరులో [illegible]) ను అన్యాక్రాంతము చేయుచున్నట్లు తెలిసినది. దానిని [illegible] విక్రయించుకొనరాదని యిందు మూలముగా తెలియజేయడమైనది.

ఇట్లు,
[illegible] వెంకటేశ్వర్లు,
నిడుముక్కల.

# ద్రావిడ, నీగ్రో నాగరికతల సంబంధాలపై పరిశోధన

—సెనిగల్ అధ్యక్షుని సూచన

మద్రాసు, మే 27 : ద్రావిడ నాగరికతకు, ఆఫ్రికాకు చెందిన నల్లజాతులవారి నాగరికతకు మధ్య గల సంబంధాన్ని గూర్చి పరిశోధన జరపడంలో ఈ రెండు జాతులవారు సహకరించాలని సెనిగల్ అధ్యక్షుడు శ్రీ లియోపోల్డ్ సెంఘోర్ నిన్న ఇక్కడ విజ్ఞప్తి చేశారు.

''మన నల్ల చర్మాన్ని, నాగరికత విలువలను చూచుకొని సిగ్గుపడవలసిన అగత్యంలేదు సరికదా అవి మనకు గర్వకారణం'' అని కూడా ఆయన అన్నారు.

ఇంటర్ నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ టామిల్‌స్టడీస్ ఆధ్వర్యాన నీగ్రో— ద్రావిడ సంస్కృతిని గూర్చి ఉపన్యసిస్తూ సెనిగల్ అధ్యక్షుడు ఈ సూచనలు చేశారు. నల్లవారు భూమాత జేష్ఠ పుత్రులనీ, వినియోగదారులుగా పటరకపూర్వం వేలాది సంవత్సరాలు ప్రప్రథమంగా నాగరికతను సృష్టించినవారు వారేననీ ఆయన చెప్పారు.

జిబ్రాల్టర్ జలసంధినుంచి, ఉత్తరాన ఇండోచైనా ద్వీపకల్పంవరకు అర్ధచంద్రాకారంలోగల సారవంతమైన భూభాగంలో [illegible], సుమేర్, భారత నాగరికతలకు కొత్తరాతియుగంలో పునాదులువేసినవారు నల్లవారేననీ, వారుమతాన్ని, న్యాయశాస్త్రాన్ని చిత్రలేఖనాన్ని, లిపిని సృష్టించారని శ్రీసెంఘోర్ చెప్పారు.

అయితే నలుపు, తెలుపు, పసుపు జాతుల వారి కలయికవల్లనే నాగరికతలు అభివృద్ధి చెందాయనీ, విశ్వమానవ నాగరికతను రూపొందించడమే ఈ శతాబ్దం ఆదర్శమనీ సెనిగల్ అధ్యక్షుడు తెల్పారు.

ఆఫ్రికాలోని నీగ్రోలకు, భారతదేశంలోని ద్రావిడులకు చారిత్రికంగాను, సాంస్కృతికంగాను, భాషాపరంగాను, జాతిపరంగాను కూడా సంబంధాలు ఉన్నాయని నిరూపించేందుకు శ్రీ సెంఘోర్ పలువురు పండితులను, పరిశోధనా గ్రంథాలను ఉటంకించారు.

### వాషింగ్టన్‌కు శ్రీ చవాన్ ప్రయాణం

మద్రాసు, మే 27 : కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ వై. బి. చవాన్ తాను జూన్ మొదటి వారంలో వాషింగ్టన్ వెళ్లి 12వ తేదీన అక్కడ జరిగే 20 దేశాల కమిటీ సమావేశంలో పాల్గొనగలనని చెప్పారు.

ఇక్కడనుంచి బొంబాయికి వెళ్లబోయే ముందు విమానాశ్రయంలో విలేఖరులతో శ్రీ చవాన్ ఈ విషయం వెల్లడించారు.

### సి. పి. ఎమ్. నుంచి ముగ్గురు సభ్యుల తొలగింపు

కలకత్తా, మే 27: పశ్చిమ బెంగాల్‌లో మార్క్సిస్టు పార్టీ నుంచి ముగ్గురు ప్రముఖ సభ్యులను తొలగించారు. వీరు పార్టీ వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొన్నారని రాష్ట్ర కమిటీ ప్రకటించింది. తొలగించబడినవారు శ్రీయుతులు పీయూష్‌దాస్‌గుప్త, సుధాంశు పాలిత్, గణపతిచౌధురి.

### గవర్నర్‌కు ఆంధ్ర ఆయుర్వేద పరిషత్తు విజ్ఞప్తి

ఆంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాద్, మే 27: ఆంధ్ర ఆయుర్వేద పరిషత్ పక్షాన పరిషత్తు అధ్యక్షులు శ్రీ పి. బి. శటగోపాచార్య అధ్యక్షతన శ్రీయుతులు పసుపులేటి కృష్ణమూర్తి, ఇ. ఎస్. సోమయాజులు, వి. టి. వి. రంగాచార్యులు, ఎన్. వి. సుబ్బారావుగార్లు రాజభవన్‌లో గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్‌ని కలుసుకొని, విజయవాడలో తమ సంస్థకు గ్రంథాలయం, పరిశోధనా విభాగం, వైద్యాలయం ఏర్పాటు చేసుకొనడానికి ప్రభుత్వము ఆర్థిక సహాయం చేసేటట్లు చూడాలని విజ్ఞప్తి చేశారు.

ఇతర భాషలలో నుంచి గ్రంథాలు తెలుగులో అనువాదం చేయుటానికి కూడా ప్రభుత్వము సహాయపడాలన్నారు. తమ సంస్థను నెలకొల్పి 50 ఏండ్లు అయినందు వల్ల స్వర్ణోత్సవం జరుపుకుంటున్నామని, ఇంతవరకు తమకు ఒక్క కాసు కూడా ప్రభుత్వము సహాయపడలేదని వారు విన్నవించారు.



Grams: 'Operation' Phone: 702

## ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎలెక్ట్రిసిటి బోర్డు

సూపరింటెండింగ్ ఇంజనీర్‌వారి కార్యాలయము
ఆపరేషన్ సర్కిల్, రాజమండ్రి-533101

## వేలం తేది మార్పు — ప్రకటన

1. బొమ్మూరు, (రాజమండ్రి మార్గం) వద్ద గల రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు యొక్క సెంట్రల్ స్టోర్సు వద్ద లభించే స్క్రాప్ మెటీరియల్స్ వేలము లోగడ ప్రకటించినట్లు 30—5—74 తేదీకి బదులు 20—6—74 ఉ. 2 గంటలకు నిర్వహించబడునని యిందుమూలముగా తెలియపరచడమైనది.

2. కాపర్ స్క్రాప్, ఖాళీ ఆయిలు డ్రమ్ములు కొనుగోలుకు టెండర్లు స్వీకరించు ఆఖరు తేది లోగడ ప్రకటించిన 20—6—74కు బదులు 2—7—74 సా.3 గంటల వరకు టెండర్లు స్వీకరించి అదే రోజు సా. 4 గంటలకు తెరువబడును

తారీఖుల మార్పును స్పష్టంగా గమనించగలరు.

వేలం అమ్మకము / టెండరుకు సంబంధించిన యితర నిబంధనలలో మార్పులేదు.

(సం) ఎం. ఎస్. వరదరాజస్వామి,
సూపరింటెండింగ్ ఇంజనీర్,
ఆపరేషన్ సర్కిల్, రాజమండ్రి—533101